# సౌభద్రుని ప్రణయ యాత్ర




నాయని సుబ్బారావు

*Saubhadruni Praṇaya Yātra*

(Voyage of love)

By Nayani Subba Rao

A Birth Centenary Publication (1899-1999)

---



**Cover page: Adavi Bapiraju**



| | |
|---|---|
| Price Rs. | : 90/- |
| Published by | : Nayani Subbarao Trust |
| Laser Typeset | : Haripriya Pulikonda |
| Printed at | : Dynamic Offset Printers, Panjagutta, Hyderabad. |
| For copies | : (1) 898/2, Nagarjuna Nagar, Hyderabad. Tel:3747133 |
| | (2) VISHALANDHRA Book House, Hyderabad. |

# నేపథ్యం

ఇది శ్రీ నాయని సుబ్బారావుగారి శత జయంతి (1899-1999) ప్రచురణ. ఎప్పుడో 1935 లో తొలి ముద్రణ పొంది తరువాత 1958 లో మలి ముద్రణ పొంది ఇప్పుడు 2000 సంవత్సరంలో మూడోసారి మీ చేతుల్లో ఉన్న కావ్యం ఇది.

ఇది కవి జీవన కావ్యం. ఆత్మానుభూతిని ప్రణయంలో, విరహంలో సంయోగంలో పండించి కవియే నాయకుడై భాసించిన ఆత్మకావ్యం. ఆంధ్ర కవితా ప్రపంచంలో తొలుత ఎన్నదగిన ప్రణయకావ్యం.

ఇది ఒక్క బిగిన అదే పనిగా రచించి పూర్తిచేసిన కావ్యం కాదు. దీని రచనా స్థానాలు పెక్కులు. 1922 నుండి 26 వరకు నాలుగు సంవత్సరాలు కవి ఎక్కడ ఉంటే అక్కడ నుండి గీతాలుగా ఖండికలుగా ప్రాణం పోసుకొని విశ్వరూపావిష్కారాన్ని పొందిన అద్భుత అమలినశృంగార, జీవన కావ్యమిది. కవి వివాహపూర్వ దశ నుండి కల్యాణ పర్యవసితమై ఫలప్రాప్తిని పొందిన దశవరకు ఏయే ప్రదేశాలలో ఉండవలసి వచ్చిందో ఆయాచోట్ల ఈకావ్యం ప్రాణం పోసుకుంది దీనిబీజావాపనం 1922 లో ఒంగోలులో జరిగింది. అక్కడి నుండి బందరు, గుంటూరు, ఆలూరు, అనాతవరం, తెనాలి, మద్రాసు, గూడూరు లలో ఈ కావ్యఖండికల రచన సాగింది. ప్రతి ఖండిక కింద అది వ్రాయబడిన స్థలాలు సూచింపబడ్డాయి. కాని సంవత్సరాలు నమోదుకాలేదు.

ఈ కావ్యరచన ముగిసి కవి ఒక ఉద్యోగంలో, నరసరావుపేటలో, స్థిరతగన్న (1928) ఏడు సంవత్సరాలకుగాని ఇది అచ్చురూపంలో

వెలుగు చూడలేదు. ఒక గొప్ప హృదయవాది కవియొక్క మహత్తర భావకావ్యం ముద్రణ చరిత్ర యిది.

ఈ తొలి ముద్రణ కూడా కవికి 'అన్న' అయిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ప్రోద్బలం వల్లనే జరిగింది.

విశ్వనాథ వారు నాయని రెండవ కావ్యం మాతృగీతాలకు పరిచయ వాక్యం వ్రాస్తూ. కవి మొదటి రచన సౌభద్రుని ప్రణయ యాత్ర ప్రకటింపబడి యిప్పటికి నాలుగేండ్లయినది అన్నారు. మాతృగీతాల ప్రచురణ 1939 లో జరిగినట్లు ఆ కావ్యంలో నమోదయింది. అందువల్ల ప్రణయయాత్ర తొలి ముద్రణ సంవత్సరం 1935 గా నిర్ధారించవచ్చు.

ఇది బందరు లోని రసతరంగిణి అనే పుస్తక ప్రచురణ సంస్థ ఆరవ కుసుమంగా ఆవిష్కృతమైంది. తొలిరోజుల్లో శ్రీ సత్యనారాయణగారి పుస్తకాలన్నీ ఈ సంస్థ నుండే ప్రకటింపబడు తుండేవి. దీనికి పోషకులుగా శ్రీ క్రొత్త వేంకటేశ్వరరావు (తెనాలి తాలూకా సంగం జాగర్లమూడి) శ్రీ చిఱుమామిళ్ళ పార్థసారథి (నందిగామ తాలూకా ముప్పాళ్ళ) శ్రీ కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దర్ (గంపలగూడెం) శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు (దేశోద్ధారక, విశ్వదాత) శ్రీ పర్వతనేని రామకృష్ణయ్య చౌదరి (గుడివాడ) ఉండేవారు. వీరంతా ఈ సంస్థకు రాజపోషకులు. చాలాకాలం తర్వాత విశ్వనాథ వారి అల్లుడు, మా స్వాహక్క భర్త, సుబ్బారావుగారు దీన్ని అజమాయిషీ చేస్తుండేవారు.

ప్రణయ యాత్ర ముద్రణ బెజవాడలో ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షర శాలలో జరిగింది. అప్పుడు వెయ్యి కాపీలు అచ్చొత్తించారు. ఇది విశ్వనాథ

అజమాయిషీలోనే జరిగింది. ఇప్పుడు నేను అతి కష్టంమీద మొదటి ముద్రణ కాపీని దొరకబట్ట గలిగాను. నాదగ్గర నిజానికది ఉండవలసింది. కాని యెక్కడ పోయిందో ఎవరు తీసుకుపోయారో ఇప్పుడు నా జ్ఞాపకంలో లేదు. ఖావి పరిశోధకులకు పనికి రావచ్చునని యిక్కడ ఈ వివరాలు వ్రాయడం జరిగింది.

తొలి ముద్రణలో అట్టమీద బొమ్మతో పాటు అయిదు చిత్రాలున్నయ్. ఆ కావ్యం చివర

**చిత్రములు :**

పుట. 9 గానమున పేరు వడసిన కన్నె పికము

పుట. 21 నీకు హారతి యీయ గాంక్షించి

పుట. 87 నా హృదయవీణ తంత్రులు నద్దమైన

పుట. 122 వత్సలా ఫాలమున నెలవంక గురుతు

**చిత్రకారులు:**

శ్రీ అడివి బాపిరాజుగారు .

శ్రీ అనిసెట్టి సుబ్బారావుగారు

అని కనిపిస్తుంది.

ఆ చిత్రాలన్నీ ఈ ముద్రణలో చేర్చబడ్డాయి. అట్టమీద చిత్రం అప్పటిదే.

తమాషా ఏమిటంటే నాచిన్నప్పుడు సుప్త జ్ఞాపక పథంలో చిత్రాలు 'బాపిబావవి' అన్న మాటలుండిపోయాయి. ఆనాటి సాహితీ లోకపు ప్రశస్త మిత్ర రత్నాలలో అందరూ అన్నదమ్ములైతే, ఆడి పాడే అదనపు గుణాలున్నాయని కాబోలు, బాపిరాజుగారిని అందరూ 'బావ' అని మన్నించేవారు. కవికి కూడా ఆయన బావే. నాకు మామ. చిన్నప్పుడు,

మా యింటికి ఆయన వచ్చిన సందర్భాలలో నాకూ, నా మరో నెచ్చెలికీ పట్టుబట్టి నాట్యం నేర్పాలని శ్రమించే వారు. ఆపాట కూడా విశ్వనాథ కిన్నెరసాని లోని ఉప్పొంగి పోయింది `గోదావరీ', అన్న గేయం. అప్పటి సాహిత్య ప్రపంచమూ, ఒకరికొకరికి మధ్య ప్రరోహమైన దగ్గరి తనమూ, అరుదుగా తప్ప అంతశ్శైత్యాలు లేకపోవడమూ ఎట్లా ఉండేవో చెప్పడానికే ఈ ఉటంకింపు అన్నట్లు మర్చిపోయాను. ప్రణయయాత్ర నాయికా నాయకులు వత్సలా సౌభద్రులకు, నిజజీతంలో హనుమాయమ్మ సుబ్బారావులకు 1925 ఫిబ్రవరి 25న గూడూరులో పెండ్లి జరిగితే వచ్చిన `బాపిబావ', ఆడపడుచుకు శ్రీచందనపు రాధాకృష్ణ విగ్రహాన్ని చదివించి, అనుంగుబావ యెదుట నాట్యం సల్పాడట. ఈ ఉటంకింపు కూడా ఆనాటి సాహితీపరుల అనుబంధాన్ని చూపించడానికే.

ఇంతకీ ఈ చిత్రాలలో ఏవి ఎవరివో తెలియ జేసే మాటలులేవు. కనీసం సూచనలైనా లేవు. రేఖలూ, వంపులూ చూడగా, వత్సలా ఫాలమున నెలవంక గురుతు అనేది బాపిరాజుగారిది కాక, అనిసెట్టి దయి ఉండాలి తప్పదు. అనిసెట్టి సుబ్బారావు, కవికి కూర్చు శిష్యుడు. నరసరావుపేట హైస్కూలులో చదువుకున్నాడు. కవి వెన్నుదట్టి సాహిత్యరంగంలో గట్టి అడుగులు వేయించిన శిష్యుల్లో ఈయన ఒకరు. బహుశా శిష్యుణ్ణి చిత్రకారుడుగా, చూడాలన్న కోరికవల్లే తన ప్రణయయాత్రలో ఆయన చిత్రాన్ని చేర్చుకొని ఉంటారు.

1958 లో జరిగిన మలి ముద్రణలో ఈ చిత్రాలులేవు. కాని బాపిరాజుగారు వేసిన అట్టమీది బొమ్మ మాత్రం ఉంది. అది అజంతా ప్రింటర్సు సికింద్రాబాదులో ముద్రితం. ఈ ముద్రణాలయాధిపతులు

శ్రీనివాస సోదర కవులు స్వయంగా పండితులు, కవులు కూడా!. మీదు మిక్కిలి నరసరావు పేట మునిసిపల్ హైస్కూలులో కవికి శిష్యులు. ఈ కావ్యాన్ని అచ్చొత్తించడం శిష్యులు గురువుగారికి అర్పించిన గురుదక్షిణ! పుస్తకం అచ్చొత్తించడం అంటే తప్పొప్పుల పట్టిక లేకుండా చేయడం, అనేది వీరు పట్టిన ప్రతిన. ఆ ప్రతినను చివరదాకా నిర్వర్తించ గలిగిన సాహితీ వ్రతులు వీరు.

మొదటి ప్రతికీ రెండవ ప్రతికీ అక్కడక్కడా చిన్న చిన్న పాఠభేదాలు కనిపిస్తాయి. అవన్నీ కవి స్వయంగా మార్పు చేసుకొన్నవే.

ఇది మూడవ ముద్రణ.లెటర్ ప్రెస్ లన్నీ వెనక్కు జారి తెరమరుగైపోగా కంప్యూటర్‌హంగామాతో తయారైన ప్రతియిది. దీని మేళ్ళు దీనికి ఉంటాయి.

ముద్రణకు పోయే ముందు శ్రద్ధగా D.T.P. చేసిన సుబ్బాచారి నా శిష్యుడు. ఆ లెక్కన కవికి ప్రశిష్యుడు. ఇతడికి నా ఆశీస్సులు దీన్ని అంద చందాలతో, వెలితి తోచని విధంగా ఆకృతి సమకూర్చి అందిస్తున్న డైనమిక్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, పంజగుట్ట, హైదరాబాదు వారికి అభినందనలు. ప్రముఖ చిత్రకారుని రేఖా చిత్రానికి రంగులు నేపథ్యం విషయమై శ్రద్ధ తీసుకున్న మిత్రులు శీలా వీర్రాజుగారికి నమస్కారాలు.

కవిపుత్రిక

నాయని కృష్ణకుమారి

8-3-898/2
నాగార్జున నగర్
హైదరాబాదు - 73
1-3-2000

VIII

# విషయసూచిక

## సౌభద్రుని ప్రణయ యాత్ర

# వత్సలకు

స్వీకరింపుము ప్రణయ దేవీ కరాంచ
లముల జారిన తులసీదళమ్ము లివియు
నా హృదయరాగసుధయందు నాని చెడని
దివ్యసౌరభ్యముల్ ప్రసాదించు కొనియె.

ప్రణయసంఘర్షణమ్మున రాజి యంత
రమున మండిన భావానలమున పొంగు
నాదు కన్నీటిచుక్కలు సూ, దినాంత
సాంధ్యరాగమ్ములకు జీవశక్తి పంచు

సుప్రసన్నవు కమ్ము ప్రేమప్రభావ
మదియు భావవిపంచికాస్యము నదించు
నమృత నిష్యందిమధుర గీతములలోన
నీకు వినిపించెదను కమనీయమూర్తి

(అనాతవరం)

# ఎపుడొ

మినుకు మినుకని మిన్నున మెఱయుచుక్క
కాలరాక్షసుఁ డడ్డమ్ము గట్టినట్టి
కాఱుమబ్బుల తెర బాసికదలి వచ్చి
హృదయముం జొచ్చి యట ప్రకాశించుటెపుడొ

చూడ ముచ్చటవైయె మనస్సున బ్రియమ్ము
వెల్లిగొలిపెడు చిన్నారి మల్లెపూవు
మండు టెండకు గందిపోకుండ నాదు
చేతిలోనికి వచ్చి వాసించు టెపుడొ

నెమ్మనము తాపమడగించు కమ్మతావు
లలముకొనుటలో తనరాక తెలియుచుండ
నుత్తరపు చలిబాధ కోర్చి మించి
మలయపవనమ్ము నామీద మలయుటెపుడొ

ప్రకృతి కాంతాధర రసమ్ము వడియగట్టి
పోతపోసిన ట్లొప్పు నొప్పుల గులాబి
క్రూరకంటకహతి సొంపు గోలుపోక
కన్నులకు విం దొనర్చెడు కాల మెపుడొ.

గానమున పేరు వడసిన కన్నెపికము
క్రమ్ము కాకుల కన్నుల దుమ్ము జల్లి
యిమ్మయిన నాదు చిత్తచూతమ్ము జేరి
ప్రణయ మకరంద రస ముట్ట పాడు టెపుడొ.

(ఒంగోలు కొండమీద)



# తెరచాటు

తెరచాటు బొమ్మవై త
త్తఱమున ననుజూచి తక్కి తాఱెడుతఱి (ప్రే
మరసమ్ము చింద పఱపిన
చిరునవ్వు మదీయ హృదయసీమఁ గరంచెన్.

సతతము నాదు నేత్రసిత
సారసయుగ్మము విశ్వమోహనా
ద్భుత భవదీయరూపమధు
పూరితమై యలరారుదాక నే
నతివ మదీయచిత్తఫల
కాంతరమందున నచ్చుగ్రుద్ది న
ట్లతికిన నీదునవ్వు మొగ
మారయుచున్ విరహమ్ము నాగెదన్

ప్రణయ మన్యోన్యహృదయసంభవము గాగ
సిగ్గుచీరముసుం గేల చిన్నదాన
సగము వాలిన ఱెప్పలతగులు బాపి
చిన్నిచూపులు నాయందు జేర్పరాదె

గోడ చా టయ్యు చెలి నీవు పాడు పాట
వలపుమొలకకు నమృతంపు ౘెలమ యయ్యె
తలిరుటాకులచాటున దాగనేమి
పిక కుహూశ్రుతి వీనులవిందు గాదొ

మును దోచున్ నునుసిగ్గువాక ప్రణయం
పున్ వెల్లువన్ లీనమై
నను విప్పారని కన్నుదమ్ముల పసన్
రాణించుమోమెత్తి చ
క్కని రాగమ్మున నీవు పాడగను త్వ
ద్గాంధర్వమాధుర్యసం
జనితానందరసాబ్దిమగ్నహృదయా
బ్జాతుండనై యుందునే

కనుల కందకయే నీవు కాంత లోన
మాటిమాటికి నటు నిటు మసలునపుడు
కరముల వెలుంగు పంగరుగాజు లొరసి
ఘల్లుమని మ్రోయ నా గుండె జల్లుమనును.

(ఒంగోలు)

# వత్సలవలపు

చెప్పె నత్తమ్మ చేతిలో చేయి వైచి
నీకుమారున కిచ్చెద నాకుమార్తె
ననుచు మును నాన్న నేఁడు పేరాసఁ దగిలి
తోసిరాజనెఁ జేసిన బాస లన్ని

ఆస యను కత్తికోత సేత్యాంకురంబు
ముక్కలై పేరు లేకపోవుటకు నేమి
కాంచఁడేమొ మా మనసులఁ గట్టివైచు
ప్రణయబంధమ్ము నఱుకుళ్ళు పడుట యకట

పాలబుగ్గల చిన్నారిప్రాయమందు
నంతికోద్యానవాటి నవ్యక్తమధుర
మైన యనురాగ మూర నన్యోన్యకంత
సీమఁ గీలించితిమి సుమదామములను

హృదయమున నఱలేని కూరిమి సెలంగ
ప్రియుఁ డొసంగిన వలపుల విరిసరమ్ము
చిత్తపేటిక దాచి ఱే కొత్తకుండ
రాగరసమున దడిపెద బ్రతిదినమ్ము

ఆ ప్రణయ దివ్యకుసుమ మాల్యంబు నేఁడు
నాదుజనకు తృష్ణాప్రభంజనుఁడు వఱపు
వేడిగాడ్పుల తలఁపున వీడి వాడి
మాడిపోవలెనంట తన్మహిమ యేమొ

తండ్రు లందఱు మాయజూదమున నోడి
కాలవశమున నడవుల పాలుగాఁగ
బ్రదుకుతెరు వేర్పడని దౌర్భాగ్యు డనుచు
మేనయల్లునిపైఁ గూర్మి మానఁదగునె?

ప్రాజ్యసామ్రాజ్యలక్ష్మిఁ జేపట్టువాఁడు
లక్ష్మణకుమారుఁ డను నుబలాటమునకు
పిన్ననాఁటనుండియుఁ బెంపుఁగన్న యనుఁగు
తోడఁబుట్టువందలి ప్రేమ మీదు రాదొ

సంపదలవార్ధి నన్నుఁ దేలింపనెంచు
నాశయమ్మున సాగు తృష్ణాఖ్యవల్లి
పావన ప్రణయైకజీవనముఁ గోరు
నాదుకుత్తుక కురిత్రాడు గాదె తలఁప

ఏమి శాశ్వత మీ భూమి ప్రేమ యొకఁడు
దక్క తెలిసియు గగన సౌధములఁ గట్ట .
వలెనె కావడి కుండలు కలిమిలేము
లనెడు వాక్యమ్ముఁ బాటింపఁ డయ్యె నయ్య

భోగభాగ్యమ్ములకు రాజ్యమునకు నగునె
వలపు మేనత్త కొడుకుపై నిలుపు టరయ
ప్రేమ సౌరభమును బంచి పెట్టు దివ్య
కుసుమ మని తలఁ దాలుపఁ గోరి కాక.

ప్రత్యుషస్సునఁ గలకలారవము లెసఁగ
జలజబాంధవు నిదుర మేల్కొలుపుఁ బులుఁగు
లేమి గోరి కావించు నా యిష్ట కార్య .
మంతరంగాంచిత ప్రణయమునఁగాక.

ఎచటనుండియొ యామని నేగు దెంచి
మావి చిగురులతోఁబాటు భావకిసల
ములును రాగిల్ల గీతమ్ము లొలుకుఁ బికము
కోర్కి యే ముండి ప్రకృతిపై కూర్మి కాక

భీషణాకృతి పిడుగులు విసరుచున్న
చెవులు చిల్లులు వోవ గర్జించుచున్న
కాలమేఘమ్ము నంటియే క్రాలుచుండు
వలపు బలిమిని కాదొకో కలికి మించు

ప్రణయ రథమున కేకచక్రమగు మెఱపు
నైజమిటులుండ నమృతనిష్యంది యైన
చందమామను మక్కువ జాలువాఱి
రోహిణీతార కోరి చేరుటకునేమి.

చందురునకుఁ గళంకమ్ము సాకు జెప్పి
నల్లమబ్బుల యాచ్ఛాదనమ్ము జెప్పి
ప్రవిమలానురాగమునకు స్వస్తి జెప్ప
చుక్క కేమెక్కు మోహంపుఁ జొక్కు గాక

బాల సుకుమార నిఱుపేదవరునిఁ జెట్ట
వట్టి యడవులఁ గష్టాలు పడుటఁ జూచి
కన్నకడు పెట్లు సహియింపఁగలదు దుఃఖ
వేదన యటంచుఁ దలఁచుటే వెఱ్ఱితనము.

సౌకుమార్యంపుఁబ్రోవైన జాజితీవ
కఠినవృక్షమ్ము బిగియారఁ గౌఁగిలించి
ప్రాకిపోవుచుఁ దనదు సంబరముఁ దెలుపు
పువ్వు నవ్వుల దినదినమ్మును వెడల్చి

అంటి నం గందు తీఁగెలే నవనిజముల
కంటఁగట్టెడు పనిసేయు నపుడు గూడ
ప్రకృతికనుల నానంద బాష్పములె గాని
వేడి కన్నీరు విడుచుటేనాఁడు గనము.

అమ్మయును నాన్న యరచేతులందుఁ దాల్చి
వెన్నముద్దవిధాన నన్ బెంచిరంట
ప్రేమబలమున నిప్పుడీ వెన్నముద్ద
కష్టముల వహ్నిఁ గ్రాగుట కిష్టపడియె.

పహిణ్ణాఁ గ్రాగక కమ్మని వాసనలకు
పుట్టినిల్లగు నేయి కాఁబోదు వెన్న
ఆపదల పేరు విన్న భయమ్ము నెందు
వనితల పతివ్రతాత్వమ్ము వాసిఁ గనునె.

జీవనము బిచ్చమున నివసించునిల్లు
వల్లకాడింక వేషలావణ్య రేఖ
లరయరా దట్టిశివున కర్ధాంగియైన
చెలివలపు బావిలోతెన్ని నిలువులొక్కొ.

అడవులం బడి యిడుమలు గుడువవలసె
ప్రాత పేలిక నైపథ్యరచన కయ్యొ
కాంతుఁ డెడఁబాయఁగనె దమయంతి నేఁడు
నిఖిలజగతిఁ జిరస్మరణీయ గాదె.

సత్యవంతుఁ డేడాదికిఁ జచ్చునన్న
బెదర కతనినె మదిఁ గోరి పెండ్లియాడి
ప్రియుఁడు చావనీ చావదు ప్రేమయనుచు
విశ్వమునఁ జాటిపోయె సావిత్రి యొకతె

ఆకస మ్మెక్కి స్వర్గమ్ము నరయనేర్చు
నరకమున సంతసంపుబండి నడుపనేర్చు
లోకమంతయుఁదానయై ప్రాకనేర్చు
నిజము ప్రేమకంటెను వాంఛనీయమెద్ది.

చంద్ర సూర్యులు తారకాసముదయమ్ము
పుడమియును నాకమును తక్కుభువనములును
ప్రేమసూత్రమ్మునంగ్రుచ్చి విశ్వకర్త
గళమునం దాల్చు ముత్యాలు గావె తలప.

బావయును నేను జతగూడి వనవిహార
రచనఁ బ్రొద్దులు పుచ్చుచు ప్రకృతిగురువు
పాదములు పట్టి నేర్చిన ప్రణయగీత
మాలికల వల్లెవేయక మనుట యెట్లు.

హృదయపుస్తకమం దదికింపఁబడిన
ప్రేమగీతాలపుటఁ జింపివేయుటెట్లు
చినుగువెంబడి పైకెగజిమ్ము రక్త
మునఁ గలిసి ప్రాణము ల్లేచిపోవకుండ

చిత్తఫలకమ్మునందు నచ్చొత్తినట్టు
లంటియున్న బావయ్య నెయ్యంపురూపు
చెఱపి ముక్కు మొగమ్ము గుర్తెఱుఁగ రాని
వానిఁ జిత్రింపఁ జేతులు వచ్చు నెట్లు

పూలదండ కంఠములకు పొందుఁ గూర్చ
ప్రేమపాశ ముల్లమ్ములఁ బెనచివైవ
కరములు కరమ్ములం జేర్చి కలికి వాలుఁ
జూపుల నివాళు లొసఁగితి సుందరునకు.

వరున కుపహారముగ నిడ్డ విలపుఁ జూపు
పరుని వదనమ్ముపై నెట్లు ప్రాకఁగలదు
అతుల చింతాభరమ్మునఁ జితుకుఁగనుల
నెత్తి నెత్తుటిబాష్పమ్ము లెగయకున్నె.

(ఒంగోలు)

# ప్రణయాహ్వానము

తేట నీరున్న కొలఁకున నీటుదేరి
సారసము సౌరభము వెదఁజల్లుకరణి
ప్రేమరసపూరితమ్మైన నామనమున
నీవలపుఁ గమ్మతావులు నింపరావె.

•

తీగెయందుఁ గులుకు తెలిమల్లెపూవ నీ
కవని రాలిపోవు నంతయేల
నెత్తిమీదఁదాల్చు నీ ప్రియుఁడున్నాఁడు
గాలితేజి నెక్కి కదలి రమ్మ.

పైదలి ప్రావృడంబుధర
పంక్తులు నింగి జనించినంత శం
పాదరహాసదీధితులు
పైకొనుచున్నవి నామనంబు ప్రే

మోదయరమ్యమై వెలయు
   చున్నను నీతనుకాంతి విభ్రమ
శ్రీదయివార క్రొమ్మెఱుఁగు
   చెన్నున తళుక్కుమనంగ రావుగా.

సాంధ్యరాగమ్ము పశ్చిమాశాముఖమున
పర్వి యెఱ్ఱనిత్రోవ లేర్పఱచెఁ బుడమి
క్రమ్ముకొను చీకటులఁ బాదకాంతు లడప
చంద్రబింబాస్య తన్మార్గసరణి వత్తె?

ముడుచుకొనియున్న హృదయంపు మొగ్గవిరియ
వలపుఁదేనియ యిదె జాలువాఱుచుండె
అమరగానమ్ము వర్షించు భ్రమరకాంత
పూవులోపల నివసింప రా వదేమి?

ఆకసమ్మను పందిరి నల్లుకొనిన
నిగ్గువెన్నెల లతలెల్ల నేడుపూచె
తారకాపుష్పములు తళ తళలఁబఱపి
హృదయము గరంచుచున్న విందీవరాక్షి.

మనముచకోర దంపతుల
　　మై తెలివెన్నెల తీవెగుంపులో
చనిచని తారకాకుసుమ
　　సౌరభవాహిని(దోగి కోసి తె
చ్చినవిరులన్ సరమ్ములు ర
　　చించి పరస్పర రాగముద్రగా
ప్రణయిని రెండుమేనులకు
　　బందమువైచెద మేగుదెంచెదే?

ఇరుగెలంకుల( జేయూతలీయ మెఱపు(
గన్నియలు, చల్లగాలి మార్గమ్ము(జూప
ధరకు డిగవటె నీకునై తిరుగులాడు
తూనిగ మనమ్ము చల్లగా, వానచినుక.

నీకు హారతియీయ( గాంక్షించి నాదు
స్వాంతమను పళ్ళెరమ్మున వలపు(గప్పు
రమ్ము వెలిగించి చూతు మార్గమ్మువంక
ననునిమేషమ్ము నీరాక కమృతమూర్తి

ఎప్పు డేదారి జనుదెంతొ యిచటికంచు
నరయుచుందు( గవాటమ్ములన్ని దెఱచి
వెనుకపాటుగ వచ్చి నాకనులుమూసి
చెప్పుకొమ్మని చిఱునవ్వు చిలుక(గలవె.

(ఒంగోలు)

# నిద్రాభంగము

పండువెన్నెల వెల్లువల్ పైకొనంగ
మింటిచుక్కలు మిలమిల మెఱయుచుండ
పండుకొని నిన్నుఁ దలపోయుచుండునప్పు
డప్రయత్నమ్ముగా కూర్కినట్టివేళ.

•

సుందరీ తావకీనముఖేందుబింబ
మస్మదీయ మనో గగనాంగణమున
వలపుసుధలోని తేటలు చిలికి చిలికి
పెట్టుఁ జిఱునవ్వు వెన్నెలపేరి ముగ్గు.

ప్రణయినీ స్వప్నవారిధిపైని లేచు
నీ వియోగకథావీచికావిలోల
పంక్తు లావలి దరినుండి వచ్చి వచ్చి
నా హృదయ తీరమునయందు నాట్యమాడు.

ప్రేయసీ యనురాగ హాలికునిచేత
చక్కగా దున్నఁబడిన నా స్వాంతభూమి
నీ వలపు వానచినుకులు త్రావిత్రావి
అవ్యయావ్యక్త భావసస్యమ్ము లీను

మోహినీ నఖరోచులు ముంచుకొనఁగ
ప్రేమమారుతస్పర్శఁ గంపించు నాదు
చిన్నితలఁపుఁ దీగెల సరిజేసి చేసి
హృదయవీణెకుఁ జైతన్య మిత్తువీవు.

బాల నీ చెక్కుగుంటల ప్రణయరసము
సగము విరిసిన పెదవులసందు నగవు
రెండుజతగూడి డెందమ్ముగుండ నుబికి
పొరలి నా కనుఱెప్పల మూత లొత్తు.

(ఒంగోలు)

# మార్పు

ప్రకృతి నిరుపమ రూపలావణ్య మధుర
మధురసాస్వాదహర్ష సామ్రాజ్య మేమొ
అనుభవ మ్మేర్పడని చిన్నతనమునందు
కోకిలయుఁ గాకియే యనుకొంటి నేను.

స్వాంతమున నంకురితములౌ నాశయములు
రాగవివశతఁ దీగెలు సాగిసాగి
అల్లువెట్టని ముగుద ప్రాయమ్మునందు
కోకిల కృతఘ్నురా లనుకొంటి నేమొ

మనసనెడు మావిమోక జవ్వనఁపు సిరుల
నలరు ప్రణయవసంతోదయమ్ము ముందు
వెక్కిరించుటయే పని పికముపాట
నది విశుష్యద్గళంబుతో నడంగుదనుక.

ప్రకృతి హృదయాంతరగ్రాహి పత్రపంక్తు
లలర దలఁపుఁ గొమ్మలు సాకు నదనునంద
మృదుకరమ్ముల లాలించె హృదయనవ ర
సాలపోతమ్ముఁ బ్రణయవసంతలక్ష్మి.

ఒక్కనా డెచ్చటనొ దాగియున్న పికము
చిలుకరించెను తేనియ లొలుకు పాట
కలనినాదామృత మ్మాని పులకరించి
చిత్త మను మావిగున్న క్రొంజిగురు వెట్టె

పరభృతమ త్వద్గళోదితపంచమస్వ
నాంచితావ్యక్తమాధుర్య మాను నాస
చెవులు నిక్కించి వనవాఁటి జేరి చేరి
మఱచితిని గదె ఋతువుల మందలింపు.

చిత్తమోహన మైన నీ చెలువ మరసి
విరహవార్ధికి వంతెనవేయు నాస
తరువు తరువునఁ గను లుంచి తిరిగి తిరిగి
మఱచితిని గదె ఋతువుల మందలింపు.

నిదురలో నాదు హృదయనీణియను మాఱు
పలుకు నీదు కుహూకలస్వనము వినుచు
నులికపడి లేచి కన్నులు నులుముకొనుచు
నేది నా పిక మంచు నట్టిట్టుఁ జూతు.

శారదతమస్వినీకాంత చంద్రదర్శ
నమున నుప్పొంగి తెలినిండు నవ్వు వెల్లి
గొలుపు నీ మనోహరసృష్టివిలసనమున
సద్దు మణుఁగుట తగునె వసంతపికమ.

చిన్నతనమున వెక్కిరించిన యీదృష్ట
హీనుఁడని లోనఁ దలపోయ కెగిరివచ్చి
వ్రాలెదే ప్రేమభావకిసాల్యరమ్య
మైన నా డెంద మను రసాలాగ్రశాఖ.

# నిద్రాసౌందర్యము

గాఢనిద్రావివశ వైన కలికిమిన్న
వలుపుఁజెలిగాడు నీ చెంత నిలిచినాడు
స్వర్గసౌందర్యవర్ణనా పత్రమందు
రెండుపంక్తులు చదివి తరించు కోర్కె.

•

నా యొనర్చిన గడుసుఁదనంపు గార్య
మతివ నీ స్వప్నలోకమం దవతరింప
సిగ్గు చెరలాడెఁ గాబోలు చిత్తవీథి
కాక మేన గగుర్పాటు గలుగ నేల?

స్వప్నముఖమునఁ దెలియంగబడిన నాదు
ప్రేమభంగుల కుపహార మేమి గలదు
చిత్తమనెడి చిమ్మన గ్రోవి చిమ్మ రాగ
సిద్ధరససిక్తమౌ మోవిచిగురు గాక.

తలిరుటాకుల చాటునఁ గులుకు మొల్ల
మొగ్గ చిలికెడు తెలికాంతి నిగ్గుకరణి
విరిసి విరియని పెదవుల వెనుకఁ జేరి
మొలక చిఱునవ్వు దాగిలిమూత లాడు.

పరిమళోచ్ఛ్వాస నిశ్వాస పవనమునకు
కడలితరగ విధాన నిల్కడగ లేచి
పడుచు సొగయించు నీ యురోవర్తనమ్ము
ప్రణయజలధి వీ వనుచుఁ జెప్పకయ చెప్పు.

•

ప్రణయ మకరంద పానోత్సవమునఁ దగిలి
వలపుఁబుప్పొడి మెయినిండ నలదు నాదు
భావషట్పదమును పట్టువఱచుకొనియె
మొగిడిన త్వదీయ నేత్రాబ్జ పుష్పయుగళి.

తరుణి తావకవదన సుధాకరుండు
తనదు మూలధన మ్మింత దాచి ఱెక్క
తలుపు లుంచిన ప్రేమామృతంపుఁ జెలమ
లనఁగ మొగిడిన నీ కన్ను లమరె నిపుడు..

ఇంతి నీ దివ్యనేత్రమ్ము లింత తెఱచి
మోహనప్రేమ పరిమళ గేహమైన
నీ విలోకనమాల్యవినీలకాంతి
నన్నుఁ దేల్చెదె జన్మ ధన్యత్వ మొంద.

(ఒంగోలు)

# చింత

చిత్తశుక్త్యంతరమ్మునఁ జేరవత్తె
ఖచరసౌందర్యవర్షాంబు కణమతల్లి
విమలకాంతుల ముక్తాఫలముగ మార్చి
మత్ప్రణయహారనాయకమణిగఁ జేతు.

•

చెలగు సంశయాంబుదములు చీలిపోవ
మెఱసెదే నాదు హృన్నభోంతరమునందు
ప్రణయరాహస్యగీతముల్ పాడి పాడి
నిర్మలానందరసము పంచెదను పుడమి.

కోమలత్వంపుఁ బస గుల్కు నీ మనోహ
రాంగలావణ్యవీక్షణాప్యాయనమున
నా కనుల్ చల్లవఱచెదే నలిననేత్ర
చిరవియోగవ్యథాలతల్ చిదిమివైతు.

మనసెరుగరాని మూగనోమును ముగించి
కపటవైరాగ్యభావమ్ము కడకు నొత్తి
స్వాంతగిరినుండి దుమికింతె వలపుటేఱు
నాదు రాగరసాబ్ధి లీన మ్మొనర్తు.

నా యనంతప్రణయజీవనస్రవంతి
కామధువు నీ మన స్తటాకమున నిండి
పట్టు కలుగులు మితిమీరి పాఱ గనెడు
పుణ్య మొనరించితినొ లేదొ పూర్వమందు

(ఒంగోలు)

# తల్లికొరకు

కమ్మతావులుచిలుకు సుమమ్ము లేరి
కట్టినసరమ్ముఁ దల్లికిఁ గాన్కవెట్టి
తత్కృపాలోకనామృతధారఁ గ్రోల
నిండుభక్తిని మాతృసన్నిధికి నేగి

•

జననిపాదాబ్జములకు వందన మొనర్చి
కష్టపడి యేర్చికూర్చిన కమ్మపూల
మాల గైకొను మియ్యది చాలదేని
హృదయసుమమైన నీకు నర్పింతు నంటి.

అమృతమయమూర్తి యైన య య్యమ్మ పలుకు
పలుకునను తేటచిఱునగ వొలుకఁ బలికె
'ప్రకృతినియమమ్ము లన్నియుఁ బాడువెట్టి
మూర్ఖుఁడా యొంటి వచ్చితే పూజసేయ.

భూమిఁ బ్రాకెడు సన్నని చీమ మొదలు
అఖిలలోకాధినాథుపర్యంత మరయ
నాత్మకుసుమవికాసరాహస్య మైన
ప్రేమసౌరభమునఁ గదంబించుఁ జూడు.

ప్రణయదివ్యరసార్ద్రతాభాగ్యహీన
శుష్కహృదయోపహారంపు సొం పటుంచు
ప్రేయసీ దేహలత కల్లువెట్టలేని
కఱకుఁజేతుల గ్రుచ్చితే విరిసరమ్ము

•

హృదయసరసులఁ దొలుకాడు ప్రేమరసము
కన్నులను తీరములఁ దరంగముల నెఱప
దంపతులు భక్తి నిచ్చు పూదండ లేరి
కంఠమునఁ దాల్తుఁ గుతుకమ్ము గ్రందుకొనఁగ

తల్లి మహాప్రసాదమని
తత్పదపద్మయుగమ్ము బాష్పపుం
జల్లుల నోలలార్చి నిము
స మ్మరమోడ్చితిఁ గన్ను లింతలో

నుల్లము నూపు నాశయప
యోధరఘర్షణమధ్యమందు వి
ద్యుల్లతికామతల్లివయి
తోచితి వొక్కక్షణమ్ము కోమలీ.

ఆత్మఁ దోచిన చిత్తమోహనను నిన్ను
చెంతఁ గను నాసఁ గనువిచ్చి యంతలోన
మాయమైన నిన్వేదుక నుపాయనమ్ము
సంగ్రహించిన పళ్ళెమ్ము జారవిడిచి.

•

చుక్క లుండెడి లోకానఁ జూచినాఁడ
నరసితిని మిన్ను మ న్నేకమైనచోట
కాంచితిని పయోనిధితరంగముల వెనుక
డెందమునఁ గాని నిన్ను నే నెందుఁగాన.

అమ్మకని కాన్క దెచ్చిన యలరుదండ
పళ్ళెరమ్మున వసివాళ్ళు వాడుచుండె
ప్రణయ పీయూషధారాస్రవంతి కవును
శీకరమ్ములఁ దడుప విచ్చేయ వేమి

దివ్యానురాగ సందీపితాలింగన
మ్మునఁ దనూలత లైక్యమును భజింప
విమలభక్తి రసాతివేల సంపత్ప్రూచ
కములైన పుకాంకురములు నిగుడ.

మాతృపాదజలేజ మకరంద మజ్జన
మ్మున శిరస్సులకుఁ బావనత గలుగ
చరణాగ్ర భూమి సాష్టాంగప్రణామక్రి
యాశేష పారవశ్యమున నలరి.

నాల్గుచేతులు మోడ్చు పుణ్యదినమందు
కరుణ మొలయు చల్లని కడకంటిచూపు
లందు నాట్యమ్ము సల్పు నవ్యాజమైన
అమ్మ సదనుగ్రహముఁ గోరవా లతాంగి.

# స్వప్నప్రణయము

చిగురుపెదవుల రాగంపు జిగి నడంచి
వెడలు తెలిపూవునవ్వులు వెల్లివిరియ
నాకు సొమ్ముల పచ్చని యందమునకు
సంతసించు వసంత వృక్షముల క్రింద.

•

పూపప్రాయంపుఁ జిగురాకుబోండ్లు కొంద
ఱాడుకొనుచుండి రానంద మాస్యజలజ
ములకుఁ దీయని తేనెయై పొలుపుమీఱ
చేరియుండెను నా ముద్దుచెల్లె లందు

తలఁపు మిన్నున మెఱసిన కలికిమించు
ప్రణయవల్లికఁ బూచిన భవ్యసుమము
హృదయమును దొంగిలించిన యింపులాడి
వెలసె వనలక్ష్మి వోలె నెచ్చెలులమధ్య.

పెరటితోఁటలో వృక్షసుందరుని నంటఁ
బెనచుకొనిన లతాతన్వి తనదుకొప్పు
నందు ముడిచిన పూగుత్తియందు వలపుఁ
జిలుగు విరి యన సతి యొప్పెఁ జెలులమధ్య.

మొయిలుచాటున ననురాగముగ్ధలైన
చుక్కకన్నెల లాలించు సోముఁ డపుడు
లలనల విలాసకేళీకలాపగతుల
నెలమి నీక్షింపఁ దెర నింత తొలగఁద్రోసె

అనవరతము ప్రియాప్రణయాస్యబింబ
మరయ గుటకలు మ్రింగుచు దిరుగు నేను
పెరటిపంచకు వ్రేలాడ వేసినట్టి
చూపుతెరవెన్క నిలుచుండి చూచుచుంటి.

కన్నె గేదంగి రేకుల కన్నులైన
నిగ్గుచెక్కిళ్ళ చిఱునవ్వు నృత్యమాడ
నాటవెట్టుచు చెలుల వెన్నాడు కాంత
నా మనోరంగమున ప్రేమనాట్యమాడె

ఆటయందలి తమక మిట్లమరె ననఁగ
చెమటబిందులు మోముపై చిందులాడ
ముత్తెములసోన యన నొప్పు ముద్దరాలు
స్వాంతపేటికి మోహనప్రతిమ యయ్యె.

అనిలసంచాలితమ్మైన యబ్జసరసి
తరఁగ లొక్కొక్కటిగ దరి దాకునట్లు
తడిక సందులనుండి కాంతావిలాస
దీధితులు వచ్చి యడఁగె నా దృక్కులందు.

•

అంతరంగపయోరాశియందు నిశ్చ
లముగ నుండిన ప్రేమరసమునఁ దృటిని
మోహఁపుందరఁగల నాట్యమున్ సృజించు
మెలఁత సురుచిరముఖచంద్రవిలసనమ్ము.

ప్రణయరసార్ద్రమంజులము
భావము లోచనవీధి నిండి వీ
క్షణసుమమాలలన్ పొలఁతి
కాయమునందు లగింపంజేసిన

న్నవిమిషుఁ జేయ జన్మ చరి
 తార్థముగా మదిలోనికోరికల్
కొనలునిగుడ్చుచుండం గను
 గొంటిని జా మొకలిప్తయై చనన్.

పొడము పారవశ్యమ్ముమన వెడలుమోద
బాష్పకణములు చూపులఁ బ్రతిఘటింప
నందు చిలవలు పలవలై మందయాన
సొబగు శబలితకాంతుల చూరలిచ్చె

అచట పెల్లైన ప్రకృతిసోయగమునకు స్వ
కీయ సౌందర్యమున మెఱుంగిడు లతాంగి
నెంతసేపు గాంచిన నేమి స్వాంతమునకు
తృప్తియనునది లేదాయె నేమి చెప్ప

తోఁటలోని వృక్షమ్ముల నీటులకును
తీగచెలుల విముగ్ధానురాగములకు
సృష్టిలావణ్య మాధురీవృష్టి కాత్మ
యగుచు ప్రకృతిదేవతవోలె నతివ యొప్పె

ప్రకృతిదేవతయైన యవ్వెన్నెలాడి
ప్రణయదేవిగఁ బాటించి వలపుఁ దేనె
లొలుకు నయనసుమముల కోమలఁపుఁజూపు
రేకు లుపహారములుగ నర్చించినాను.

కాని యన్యోన్యలోచనాగ్రముల వెడలు
వాలు మెఱుఁగుఁజూపుల కెదుర్కోలు సంబ
రమ్ము లేకుంట చిత్తసరసున నూరు
ప్రమదరస మది కూలంకషమును కాదు

చంద్రముఖిచూపు వెన్నెలజాలులోన
మెఱసిపోవు తలంపు ముమ్మరముగాగ
చూపు తెర వీడి చేరితి సుందరాంగి
పాద చిహ్నాంకమైన పావనధరిత్రి

పాలగచ్చు మెఱుంగుల బావిబొడ్డు
నానుకొని కాంచినాడ రవ్వంత సేపు
తోరమై మించు కేళీకుతూహలమున
బాహ్యవిశ్వమ్ము మఱచిన పద్మముఖుల

లోచనములతో డెందమ్ము నాచికొనిన
తామరసనేత్ర కలికి బిత్తరపుఁజూపు
వెల్లువల దొప్పదోగెడు విధము మదిని
తెప్పపాటుకాలమ్ము తర్కించుకొంటి.

బావిలో తొంగిచూచెడు పగిదినుండి
అందరును వినునట్టు లుచ్చైఃస్వనమున
చెల్లెలాః చూతు రమ్మిందు చిత్ర మొకటి
అద్భుత మ్మద్భుత మ్మని యఱచినాను

పొసగ వెన్నెలకుప్పలు పోయువారు
చెమ్మచెక్కలు తట్టు రాజీవముఖులు
దాగుకొను నాటయందలి తల్లికూడ
ముద్దుచెల్లెలు మేటియై ముందునడువ

అందఱును చిత్ర మీక్షించు నాతురమున
తేనె పెరనుండి వెడలెడు తేంట్లకరణి
మేనిక్రొమ్మించు మిసమిసల్ మించవచ్చి
పొందుగా బావిచుట్టును మూగినారు

చిన్ని నునుసిగ్గుతరఁగలు చెంగలింప
మల్లికాకుంజ మను కట్ట యెల్లగాగ
నాగిపోయెను మార్గమధ్యమ్మునందు
ప్రణయవాహినియైన శంపాలతాంగి.

చెల్లెలింగూర్చి చిత్రవిచిత్ర వర్ణ
ముల నొయారమ్ముఁ గులికెడు మూఁడు నీటి
కోళ్ళు వరుసగ నిప్పు డిక్కూపవారి
మునిగి తేలెడి నాశ్చర్యమును గొలుపుచు

•

మునిగి యడుగున కేగిన పులుగు లిపుడె
తేలి మీ కద్భుతమ్ము సంధించు నిందు
చూడుఁ డని వారదే దృష్టిఁ చూచుచుండ
సందుఁ గనుఁగొని చల్లగాఁ జారినాను.

పందిరిగుంజ నానుకొని
పైకొను సిగ్గున మోమువాంచి నే
లం దన వ్రేల రాయుచు వి
లాసము ప్రోవయినట్టులుండె నా

సుందరి కంపమాన తను
    శోభన కాంతుల కోడి రేకు వి
చ్చుం దెలిమల్లె మొగ్గగమి
    సుంకము వెట్టగ కమ్మవాసనల్.

అడ్డ మున్న నికుంజమ్ము నవఘళించి
చూపు తేజీ యెదన్ దరల్చుకొనిపోయె
వనిత యంగదేశమున సవారిసేయ
పాదములు నన్ను నటకుఁ జేర్పకయమున్నె

•

అడుగు సవ్వడిలో వినఁబడిన నన్ను
మోము మలిపి వీక్షించెఁగాఁబోలు తరుణి
అంగమునఁ గందళించు లజ్జాంకురముల
కొమరుఁ బ్రాయంపు మిసమిసల్ కొల్లవోయె.

అగ్గలపుఁ బ్రేమ నొక మల్లెమొగ్గకోసి
చెలియ కబరీభరమ్మునఁ జెరివినంత
పలుకు చూపుల రాఁదగు స్వాగతమ్ము
వెలది ముసిముసినగవులో వెల్లివిరిసె.

అంతట సాహసమ్ము హృద
  యాంతరమందునఁ జిమ్మిరేగ న
క్కాంతకరమ్ము హస్తములఁ
  గప్పి వచించితివిట్లు నవ్వు పూ
బంతుల లీలగా విసరివైచుట
  చాలునె పల్కుఁదేనెఁ ద్రా
వింతువొ చూపుసైగ నల
  రింతువొ సిగ్గుల పెండ్లికూతురా.

ఈ వియోగానలము  భరియింపలేక
వచ్చితిని నీదు మంజుల వాక్సుధా ర
సాతిశీతలశీకర వ్రాతమందు
మునకవైచెడు కాంక్షలు మోసులెత్త.

పలుకు బంగారమైనచో ప్రణయరసము
నురువుగట్టెడు నీ మనోహరకటాక్ష
వాహినులలోని చలువలు పంపొనర్చి
యింతి క్షణకాలమైన లాలింపరాదొ

వలపు 'కీ' పూర్తిగా నీయబడిన కతన
గుండె గడియార మెటు కొట్టుకొనునొ చూడు
మనుచుఁ బ్రేయసి హస్తమ్ము నస్మదీయ
వక్షమున గట్టిగా నొత్తిపట్టినాడ.

కరమృణాళమ్ము కంపించె కంపమాన
వదన రాజీవమున స్వేదమధువు సిందె
కలికి కాటుకల్ కార్కొన్న కన్నుగొనల
చికిలి వాల్జూపుమెఱపులు చిక్కువడియె

ఇంతలో నట కిటుకు గ్రహించి మరలు
మించుబోడుల హాస్యముల్ మిన్ను ముట్టె
కొంటె చిన్నన్న యనుమాట కొంత కొంత
సోదరీవాక్కు వీనుల సోకెనందు

అది మొలకతేట చిఱునగ వగునొ అమృత
మధుర లజ్జావిలాస సంపదయొ దాని
గగురుపాటినమేనఁ జుక్కలు పొడిచెను
చెలుల చప్పట్లు నాకు మేల్కొలుపు లయ్యె

(ఒంగోలు)

# క్షణము

ఆపరదిఙ్నాయికాదరహాస మనఁగ
నభినవాస్ఫుట ఫణితుల ననుపదమ్ము
తోచు తొలకరిమెఱుపులో తొంగిచూచి
త్వన్మనోహర రూపలావణ్యరసపు
వెల్లువల రోదసిని కాంతి వేల్లితముగ
చెసెదవు నాదుప్రేమ కాంక్షించికాదొ.

యామినీకాంతగళసీమ నందగించు
తారకారత్నహారముల్ పేరురమున
చిక్కువడి మేఘపుం బైటచేత నావృ
తమ్ములై చెన్నుమాసిన తరుణమందు
కలికి చిఱునవ్వు తీగెలో కందళించు
వెలుఁగు పూరేకులను నభఃస్థలి విదిల్చి
కొనుచు మెఱసెదు మోహినీ క్షణము నీదు
ప్రియుఁడు కాఱుచీకటులకు బెదరు ననియొ
విశ్వ మమృతమయ మ్మయి వెలుఁగుచుండ
నమృతరాజ్యమ్ము బాలించు చాకసమున

కొలువుదీఱిన నిండు రేవెలుఁగు కిరణ
డోలికలలోన తూఁగుటూయెలలూగు
చాత్మపాదనఖస్పర్శ నన్ని దిశల
కించిదరుణచిత్రముల రచించె దీవు
కదలు జడనుండి యొక్కటొక్కటిగ రాలు
విరుల నెత్తావి గమగమల్ వెల్లివిరియ
కోకిలాకంఠమునఁ బాడుకొనుచు పాట
లేవియో సృష్టి సౌందర్యజీవనదిని
దివ్యగానతరంగపఙ్క్తిని సృజించె
దీ విలాసవిశేషమ్ము నీ వియోగ
భారమునఁ గ్రుంగు నా కుపహారమేమొ.

మండు వేసంగిఁ బిడమటి కొండగాడ్పు
టూదరల రేగుమంటల కుడికి యుడికి
రాత్రి యెట్టులో వేగించు ప్రకృతితనువు
సేదగొన వేకువన్ తూర్పుసీమనుండి
పయనమైవచ్చు చల్లని పైరగాలి
యూర్మికల దోచు నీ తావియూర్పుసోకు
వడకు బుట్టించు విరహతాపప్రభూత
కార్శ్యభావప్రదర్శకాంగకములందు
చంద్రికాహాసిస్రపాతస్తుషారవారి
పూరమున నోలలాడి పుష్పాదుల మెత్తి
వచ్చు శిశిరర్తుశీతలస్పర్శ మాద్రి
నిజముగా నన్నుఁ బ్రేమించు నీరజాక్షి
వేని యీ దొంగదోబూచు లేల నీకు

ప్రణయబంధమ్ము చేఁ గట్టువడెదవేని
మొయిలుచాటుల దాగిలిమూత మావి
నందనమునుండి జారి మందారపుష్ప
దళము తలపైని రాలు చందమ్ము దోప
క్షణమయిన నిల్వరాదొ నా సరస నీవు.

అంతటను నార్ద్రశోభల నలవరించు
ప్రణయరసమున విచ్చు లావణ్యసుమము
లెడనెడను రాలి కన్నుల కింపు నింప
సిగ్గుగాలికిఁ గదలు నీ చిన్నిమేను
తీవ కాలంబయష్టినై తేజరిలుదు
నో!

•

దృఢాలింగనాసవాస్వాదమత్త
తనుయుగమ్ము సమ్మోహనోదధివిలోల
వీచికాడోల నూగుచో విరియు నీదు
రదనకోరకనిష్యందమధురమంద
హాసమకరందబిందువు లధరపల్ల
వములఁ బాయంగ నొత్తుచు వదనసీమ
కుబికి చెక్కుగుంటల నింకుచున్న యపుడు
ముగ్ధమోహనలావణ్యపూరశోభి
తమ్ములై యొప్పు నయ్యమృతంపుఁ జెలమ
లందుఁ దీయందనపుఁబస లావరింప

ముద్దుకలకండపలుకుల ముంచిముంచి
యెత్తికొందునొ.

తనయంద మినుమడింపఁ
జేయు మన కలయికకుఁ బేర్చిన ముదమున
ప్రకృతికుసుమాక్షతలు మనపైని చల్లి
దీవెనలతోడ తన నూత్న దివ్యధామ
మందు మనల నాహ్వానింప మొల్లపొదల
కోనకో, సెలయేటిపొంగులకుఁ దడిసి
నీడలారెడు మావిపందిళులక్రింద
చెమ్మగిలు పచ్చపట్టు పచ్చికబయళ్ళ
కో, నభోమార్గయాత్రికుం డైన వారి
ధరుని నిలువున దోచి యతండు దివిజ
నాథుపంపున నేలపై నాకరచన
దృశ్యముగఁ జేయఁ గొనుచుఁ బోయెడురసామృ
తమ్ము దైనందినమ్ముగ తనివిదీఱ
త్రావి యక్షయ యౌవన శ్రీవికాస
వైభవశ్యామలమ్మయి వఱలు కొండ
నెత్తమునకొ, స్నిగ్ధతఁ దళుకొత్తు నీదు
చెక్కు టద్దమ్ములకు బ్రతిసేయవచ్చు
చలువఱాదీవికో, మదిఁ జెలఁగు వలపు
నిండుకొను తమకమున ఘూర్ణితము గాగ
తీరవనమధ్యమునఁ దేటతీయనీటు
దొనకెలంకున లోనఁ ద్రోద్రోపులాడు
సిగ్గు కంపించు నాకులఁ జిత్రితముగ

మోమువంచి శోభిలెడు సొంపుల గులాబి
కాంత పూమోవిఁ జుంబింపఁ గరముఁ దత్త
ఱిలెడు కెరటంపుఁ బెదవుల జెలువు గులుకు
జలధి వేలాతి సుందరసైకతస్థ
లమునకో, మఱి యే మంజులప్రదేశ
మునకో, నొ స్వాంతవల్లకీ ప్రణయతంత్రు
లందు రేగు నీరవ రాగమైన గాన
మును వినుచుఁ జొక్కి కను లరమోడ్చ నీవు,
నీ యవలిమూపుఁ బ్రాకు మదీయ వామ
కరము నెదిరించి దానిచే గట్టువడఁగ
నీ యెడమచేయి, బిసబంధమో యనంగ
నాదు నడుమును జుట్టిన నీదు సవ్య
కరము నా దక్షిణకరరిపుఁ గౌగిలింత
నలర, రాపాడు ప్రక్కలఁ బులక లెగయు,
శ్యామ నా యనురాగ కావ్యమ్ములోని
వలపు పాటలు స్వాప్నికవర్తనములు
విరహ తాపాగ్నిఁ గ్రాగినవిధము దేట
పఱచుకథలు రహస్సంభవమ్ములైన
ముగ్ధచేష్టలు ముద్దులు మూటగట్ట
నీదు చెవిదండ నూదుచు నాదు పెదవు
లంటఁ బులకించు నీ బుగ్గ ననుపదమ్ము
పంతమునఁ దోచు చెమటల నంతులేని
పూజలను సల్పి పడసిన పుణ్యఫలము
కలిమిగా యంచు పొంగు నా గండఫలక

మున దుడిచివైచుచు ముదమ్ము ముంచుకొనఁగ
దారితీయుదునో!

నిజముగా నన్నుఁ బ్రేమించు నెలఁతవేని
క్షణ మయిన నిల్వరాదొ నా సరస నీవు!

(నెల్లూరు రైల్వేస్టేషన్- రాత్రి)

# గాలిపటము

ఎగురవైచితి వీవు, కా దెగిరిపోతి
నేనె నా హృదయమ్ము నీ కెఱుకపఱుప

అంతు పొంతును లేని యియ్యంతరిక్ష
రంగమున నిట్టి దని చెప్పరాని నాట్య
మాడుచో వీచు సుడిగాలి యలలతాకి
డులకు గిరికీలు కొట్టుచు నిలకు వ్రాలు
నపుడు నిద్దురమంపు వాయంగఁ గదలి
మొయిలు తెరపైన ధవళిమ మోసులెత్తఁ
నక్షు లల్లన విచ్చు వర్షాగమంపు
టుదయలక్ష్మినవాంశుసంపదల గుత్త
గొనిన నీమోము స్మృతిపథమ్మున నటింప
హర్షమున లేతు నాకస మ్మంట మఱల
ప్రళయరుద్రుని కేళికారామ మైన
యీ భయావహశూన్యమం దిట్లు నన్ను
తోలుబొమ్మాట లాడింతు వేల ప్రణయ
సూత్రమును వ్రేళ్ళమధ్యఁ జేర్చుకొని యుఱక

లాగి వదలుచు చెరలాటమా ! గభీర
వదనమున రేకదీర్చు నవ్యక్తమంద
హాసమున కర్థ మేమి? నఖాగ్రధార
దారమును ద్రెంచు తలఁపు పుట్టదుగదా ర
వంత కొనయాసతో తేలియాడుచున్న
గాలిపటము ఝంఝానిలాఘాతమునకుఁ
గొట్టుకొనిపోయి పొదలఁ జిక్కుకొని చినిఁగి
తునియలయినంత నీకు వచ్చునది యేమి?

కండెఁ జుట్టుచు దారమ్ము క్రమముగా త్వ
దీయసామీప్యమునకు రావించి నన్ను
నీదు హృదయాంతరమున బంధింపు మంచు
వేడుకొనుచుంట లేదు నీ వ్రేళ్ళమధ్య
నలరుదారమ్ముఁ ద్రెంపకు మంతె చాలు.

మునుపు నీకన్నుఁగవలోనఁ దనివిదీఱ
ననుభవించిన ప్రేమరహస్య మిపుడు
పంచిపెట్టఁగ దారమ్ము ప్రణయసూత్ర
ధారిణీ శూన్యమున జీవితమ్ముఁ దీర్తు
పదిలముగ దారమును నీవు పట్టుకొమ్ము

(బందరు-బొంబాయి)

# సాక్షాత్కారము

దట్టపున్నీలనీరదాంతరమునందు
దాఁగుకొనియున్న చంద్రమండలపు రేఖ
చిటికెలో పైకి లేచివచ్చిన విధాన
ప్రణయ మావిర్భవించె నా స్వాంతవీథి.

•

దినదినమ్మును కుంకుమ దీప్తు లొలికి
అంతలో మాయమగు సంజ ఆ దినమ్ము
జల్లుగొలిపెను వలపు నిశాప్రశాంత
గర్భమున వన్నెవన్నె చెంగలువ లీని

ఆ చలత్తారకాశ్రుతియందుఁ గలయు
శ్రావణాంబుదవర్షానురాగగీతి
మాఱుమ్రోయుచు నున్నది మన్మనోవి
పంచికాప్రేమతంత్రులపై సతమ్ము.

అమృతమధురమ్ము లైన వర్షాంబుకణము
లబ్ధి విలయోర్మికల కుపహార మొసఁగి
కలికి మెఱపులరాగమ్ము క్రమ్ముకొనఁగ
ప్రకృతి ఆనందవాహినిపైనిఁ దేలు

నిదురవేళలయందు సన్నిహిత మగుచు
ఆత్మగోచరమౌ ప్రణయంపుస్వప్న
ముదయమున విస్మృతిపథమ్ము నొందకుండ
నెదుట సాక్షాత్కరించెడు నేమొ తెపు.

•

# దాఁగిలిమూఁత

ఆ వినీలతరుచ్ఛాయలందు నైక్య
మైన మన నిర్మలప్రణయాంచలమున
స్నేహపుష్పమ్ము పరిమళించిన వికాస
వైభవము సుళ్ళుగొను నాటపట్టులందు

•

అంటి దాఁగిలిమూఁతాట లాడుకోర్కి
కలదు నాకని తల్లి యెక్కడ నటన్న
పలుకు నా నోటిలో వెలువడెనొ లేదొ
ప్రేమదేవత సాక్షాత్కరించె నెదుట.

నీలనీరద మాలికాన్విత నభమ్ము
వెలువరించిన మెఱపుఁదీగెల తళుకులు
దిద్దుకొన్నది శ్రావణేందిరవిధాన
ముగ్ధమూర్తినై కన్నులు మూసికొంటి.

ప్రావృడాగమమారుతస్పర్శఁ గొనిన
కుసుమముల చల్వ లింకించుకొన్న చిన్ని
వ్రేళుల నేత్రములు గప్పి పిల్లి వచ్చె
నెలుక భద్ర మ్మటంచుఁ జాటించి విడచె.

నీ లావణ్యరసంపుఁ గ్రొన్నురుగు
వన్నెల్ దోఁచి రాగోదయ
శ్రీలాలిత్యము గుంజుకోగనుట
విస్మేరారుణాబ్జంపుఁ గాం
తాళమ్మున్ రగిలించు చూతకిసలాం
తర్ద్యోతమానాంత్యసం
ధ్యాలక్ష్మీతనులిప్తకుంకుమము
చాయన్ నిన్ను వెన్నాడితిన్.

ఈ గులాబీ పూవుటీరంపు మొత్తమ్ము
లో దుష్టకంటకబాధఁ గొనక
చెరలాడితిని నవాసృగ్బిందు రేఖారు
ణాంశుమాలా శోభిమైన మేను

నా మనోరాగ చిహ్నమ్ముగా నునుఁబచ్చి
తేనెల క్రొంగ్రొత్త తీపుపసలు
జార్చు మందార ప్రసవగుచ్ఛ మధుర సౌ
రభములో నీ యనురాగ మహిమ.

చదువుచును నిన్ను వెదకితి సంతతమ్ము
నాదువీనుల శబ్దించు నీదుహస్త
కంకణారవమును బాదకంజనూపు
రధ్వనియుఁ దోడుగా నహోరాత్రములును

అది భయంకరమై తోఁచె నా నిశీథి
వెల్లివిరిసిన జ్యోత్స్నాప్రపుల్లరచన
లిప్తలో వారిదాంతర్విలీన మగుట
పోయితిని తల్లియున్న పూబొదకుఁ దిరిగి.

కాని కార్కొన్న కటిక చీకఁటులలోనఁ
దుడుచుకొవి పోయె వచ్చిన యడుగు జాడ
ఆ తఱిని విన్చె వలపులజోతి వెదకి
కనుగొనక వట్టి దాత్మ వికాస మనుచు.

అది మొద లీ వనాంతరము
నందు జపా ప్రసవంపు రేకులన్
గదుములు గట్టు రక్తిమము
గద్గదికం గొన కూనరాగఁపుం
బదముల నెన్నిపాడితినొ
స్వాంతముపొర్లు వియోగబాష్పపుం
జిదురలు రాలు పుప్పొడుల
ఛిన్నహృదంతరసీమ దాచుచున్

అపుడు వినవైన నీ కంకణ(పురవమ్ము
చెవులు చిల్లులువోవ నంచితము నాదు
హృదయమున మాఱుమ్రోయుటలేలొ ప్రణయ
ఘంటికాదివ్యనాదసంకాశ మగుచు.

పొరలు పొరలైన మేఘ(పుందెరలమధ్య
రక్తిగట్టిన యా సాంధ్యరాగలక్ష్మి
నాట్యరచనావిశేషమ్ము నా ప్రణయ(పు
వింతపిచ్చికి సరి వెక్కిరింత యేమొ

ఆకాలాంబుదమాలికామిళితమా
  యాసాంధ్యరాగింపు వే
ళాకోళంబులు లెక్కసేయుదునె
  లీలాసుందర భ్రూలతా
వ్యాకోచమ్ములలో దరస్మితము
  నాపైఁ జిందునేనీ గతిన్
నీ కార్పణ్యము గడ్డకట్టుటలు
  చన్నే దివ్యమందారమా.

కోటగట్టిన వర్షాభ్రవాటివెనుక
ఆదిసంధ్యావిముగ్ధ రాగోదయమ్ము
బాలభాస్కరు ముంచు నీవేళనైన
ఈ వియోగంపుటాట చాలించవలదొ.

ఏ పొదలమధ్య దాఁగినావో ప్రభాత
మందమలయానిలమున నీమాట లేదు
చిక్కెదే నీవు నా దృఢాశ్లేషమందు
కలసిపోదము తల్లియిక్కకు ముదమున.

(ఒంగోలు)

# భవిష్యత్తు

తళుకు నీనినది సంధ్యారాగరచన క్ర
మ్మిన కాలమేఘఁపుం దునుకలందు
నెఱజాణయైన క్రొమ్మెఱుఁగునాట్యము వెంట
జడికొల్పినాఁడు మేఘుఁడు రసమ్ము
గిరికుమారుని ప్రేమగీతాలపొంగు వాఁ
కలు కట్టినది పాలకడలివఱకు
పులకరించినది గట్టులు పొర్లు సెలయేటి
కౌగిలింతలకు కంకరపొలమ్ము

అనుపమప్రేమచిత్రమ్ము లన్నియొకట
విలుచుకొనియు నా యెడ నొక్కవికృతి పూని
ఇట్లు నా హృదయమ్ము దహించునేలొ
శారదమనోజ్ఞనవవికాసమ్ము పెంపు

ఈస్వాతికార్తె రానేవచ్చె తనవెంటఁ
బడు క్రొమ్మెఱుఁగుతళ్కునడుమ దాని
రదనకోరకముల రాపిళ్ళలో సాన
దీఱిన చిఱునవ్వు తేట కొంత
దాఁచిపెట్టుకొని రాఁదగదొ మిన్నున బార్లు
గట్టి పాఱెడు బలాకములమార్గ
మనుసరించితిని సాయంకాలసంధ్యా వి
హారమ్ము లంధకారావృతమ్ము

లగు ప్రదేశమ్మువఱకు రాపాడుమేఘ
సముదయమ్మునఁ జెలఁగు గర్జనలెకాని
దాని ప్రణయవిపంచికాతంత్రులందు
హాయిఁగొలిపెడు గీతిము లందలేదు.

నిరుడీరోజులలో ప్రభాతసమయో
న్మేషాంబుజాతమ్ములన్
మెఱయున్ మంచులచేత నా ప్రణయ
సందేశమ్ము పంపించితిన్
తిరుగా నేఁడు తుషారదూతికలు
రానేవచ్చె రావేమి త
త్సరసాలోకనమాగ శాంచలము
లుద్గారించు ాగచ్ఛటల్

ఈ వియోగవ్యథావల్లి యిట్టులెన్ని
స్వాతివర్షాంబుధారల చవులుగొనునొ
ఈ ముసురుకొన్న మేఘమ్ము లిట్టె విరియ
మంజులము కాదొకో చంద్రమండలమ్ము

ముంచుకొనివచ్చు నీ స్వాతిముసురులందు
ప్రళయనిర్ఘాతపాతముల్ ప్రబలునేమొ.

(క్లార్క్ హాస్టల్)

•

# అవధి

విచ్చిన శరన్నిశీధినీవేళలందు
బయలు ప్రాఁకిన తారకాస్వప్నకథలు
నాకు దుస్సహ మైనవి నీకుఁ జెలిమి
కత్తెయౌటఁగదా చలిగాలి విసరు.

•

ఈ చలి వియోగరాజ్యంపుటెల్లఁబోలు
నీ మనసు మూలమూలల నిదురవోవు
ప్రణయమకరందమాధుర్యమున లవమ్ము
సంతరించుక వచ్చెనా చాలు నాకు.

అలసిపోతిన యేనాఁటి కంతులేని
కాలచక్రంపుటాకుల కదలికలకు
ప్రణయనీహారశీకరార్ద్రమ్ము నీదు
దృగ్విలాసమ్ము నను సేదదేర్చు టెపుడు.

ఎంత యత్నించి వెలుఁగలే దింత హృదయ
దేవళమ్మున దీపావళీవలయము
స్నేహపూరమ్ము పొంగు నీ చిన్ని మేను
క్షణము మెఱసిన నట ముట్టుకొనునొ యేమొ.

చికిలిపూదేనెలకు తుషారకణములకు
నేమి సంబంధ బాంధవ్య మీ శరత్ప్ర
భాతవేళావికాసిపుష్పములకొనల
కలసికొన్నవి ప్రణయశృంగార మొలయ.

•

(క్లార్క్ హాస్టల్)

# ప్రేమ ప్రకృతి

1

నీదు వదనాంచలములు పండించుకొన్న
మందహాసమ్ములకు మాఱు మసృణదీర్ఘ
వేణికానీలకాంతులు• విప్పు మల్లె
పూలు కప్పును నా ప్రేమలీల లచట

అది నాకేమి కటాక్షవీచికల
నోలాడించు లేకున్న మా
ను దివౌకఃప్రమదానురాగముస్రవించున్
దివ్యగంగోర్మికా
పదవేగమ్ములతోడ నా ప్రణయభావ
శ్రేణి డెందమ్ము పొ
ర్లి ధరిత్రీవలయంపుటొడ్డులను
ప్రేరేపించు రాగచ్ఛటల్

నీ పలుకు పుట్టతేనెపొందికలు నాకు
కాకపోనీ వసంతరంగముల మొలచు
కోకిలామంజులస్వనాంకూరములను
నా ప్రణయ దివ్యగానమ్ము నాఁటు దెసల.

తావుల్ చిమ్మకపోవనీ ప్రణయ
మందారమ్ము నీలోన ఆ
శావైఫల్యము లేదు నాయెడ శర
చ్చంద్రార్ధరేఖోదయ
శ్రీ విన్యాసలవమ్ములోనమృతమూ
రింపన్ బ్రయత్నించెడున్
భావజ్యోతుల కాటపట్టయిన నా
స్వాంతమ్ము రేకెత్తెడున్.

2

నీకు నాయందు ప్రణయమ్ము లేకపోవ
నిమ్ము నా సకలమ్ము నీకే నిజమ్ము

(క్లార్క్ హాస్టల్)

# నీవు-నేను

త్రిభువనమ్ములలో రసోద్దీపనమ్ము
వెల్లివిరియించు ప్రణయరూపిణివి నీవు
నీ దరస్మితరోచిః ప్రసాదకాంక్ష
కొనలుసాగిన ముగ్ధభిక్షుకుఁడ నేను

•

అమృతమునకు మాధుర్యమ్ము లలవరించు
కలశవారాశి నీవు నీ యలల లేఁత
పులకరింపుల నునుఁజలువలకు మురియ
నెదరు వేచిన బాలచంద్రుడను నేను

స్వర్గధామమ్మునందు విస్ఫారదివ్య
శోభ లడరించు నిర్మలజ్యోతి వీవు
విమల సుస్నేహపూరనివేదనమ్ము
లొదవ నిను బూనవెంచు ప్రమిదను నేను

సందువోయిన నా పూర్వజన్మ తపము
పట్టుపఱుపఁగలేని యుపాసనాధి
దైవతమ వీవు నీదు ప్రత్యక్షమునకు
గడియ లెంచుచు నుండు భక్తుడను నేను

జన్మ జన్మాంతరముల నా స్వాంతవీథి
నీ సుధా స్వాదు లజ్జా విలాసరేఖ
పఱపి కికురించి పోయిన మెఱుపు వీవు
నేను నీ మార్గములు చూచు నీరదుఁడను

ఏ యనంతకాలమునాఁటి దీ ప్రణయము
నిండె జీవితాంతర్వాహినీతటముల
నీవు జీవనదాత్రివి నేను జీవి
నీవు లేకున్న నా లేమియే ధ్రువమ్ము.

(క్లార్క్ హాస్టల్)

# ఈ పినాకిని పుట్టిన దెచటొ

ఈ పినాకిని పుట్టిన దెచటొ వర్ష
సమయలావణ్య రేఖాప్రసాద మొలయ
పొదివికొన్నది విక్రమపురతటంపు
టిసుకలో ప్రేమమార్గ మూహించు నన్ను.

•

ఈ పినాకిని పుట్టిన దెచటొ నేను
నిలిచియున్న తటమ్ము కొంచెమును నురుగు
లెత్తిన ప్రవాహమున విరియించుకొన్న
దమలిన ప్రణయార్ద్రసౌఖ్యముల కేమొ!

ఈ పినాకిని పుట్టిన దెచటొ నన్ను
ముంచుచును దేల్చుచును గొనిపోవుచున్న
దచట వారాశి గర్భమ్మునందు నొక్క
యిగురు రత్నంపుఁదునుకఁ గావింప నేమొ!

# అమృతభిక్ష

ఈ ధనుర్మాసమునఁ దలపై ధరింపఁ
బడిన యక్షయపాత్రతో వాడవాడ
లందుఁ దిరిగి వేసరితిన యంద రాని
ఫలమవైన నీ పాటలు పాడలేక.

•

నీ గృహాంగణభూమిపై నేర్పు టవధు
లైన సంక్రాంతిముగ్గులకైన కుంచె
నీ యమృతముగ్ధహస్తమ్ము నా యెడంద
కలుపుకొన్నది ప్రణయరాగంపుఁగళిక.

నేను శ్రాంతుఁడనై వచ్చి నీ గృహమ్ము
ముందు నీవు పెట్టిన గొబ్బిముద్దలపయి
పడగలెత్తిన తావిగుమ్మడులయందు
నీ విధము చూచుకొని త్రపాన్వితుఁడ నైతి.

నీ కృపామౌగ్ధ్యమున పులకీకృతుఁడను
పారవశ్యమ్మునన్ మేను వంచుకొన్న
నాకు పెట్టుము భిక్ష! అలోకమధుర
ధామమున దైన నీ ప్రణయామృతమ్ము

(ఒంగోలు)

# ఓర్పు

ఓయి పూర్వానిలార్భక ! నీ యదృష్ట
రేఖ వంగిన యీ శీత ఋతువునందు
తోలుకొని వచ్చెదవు సముద్రాలనడిమి
జలదముల మొల్క చేలపై జాలిచేత

ఈ ధనుర్మాసపుం జలి కింత బిగిసి
కొనినయవి వానచినుకులు కనుటయెట్లు
నీ నడతయందునన్ రసాన్వితమయైన
దవసరము కాలమానమ్ము నరయ దనుట

నీవు కారణమైన యీ తీవె మసుగు
పైరు పచ్చలకున్ జీడ పంచునేమొ
చిత్తమునయందుఁ దాలిమి చిక్కఁబట్టి
వేఁచికొను పునఃశ్రావణవేళదాఁక.

(ఆలూరు)

# అంతులేని యాత్ర

యౌవనలక్ష్మి పల్లవిత
   మైన వసంతపు టెఱ్ఱసంజలన్
దేవి! త్వదీయపాద నఖ
   దీప్తులు నా హృదయంపు మొగ్గలో
భావి సుమంపు టాకృతులు
   వ్రాసిన యప్పటినుండి యాగ కీ
జీవనధార నా ప్రణయ
   సింధువు పాఱు తదంతరమ్ములన్

నీ సరళంపురూప మది
   నెమ్మనమందున ముద్రితమ్ముగా
మూసిననేత్రముల్ హృదయ
   మూర్తిపయిన్ నెలకొల్పి యెన్ని పూ
జా సమయమ్ములన్ ప్రణయ
   సాగరమున్ మథియించినానొ ల
జ్జాసమమైన నీ యమృత
   హాసము కొంచెము సేకరింపగన్

ఈ మధుమాసపుంబ్రకృతి
    యెత్తిన మేఘపతాకలందు సం
ధ్యామదిరాక్షి రక్తిమెయి
    నద్దిన చిత్రములంటి దివ్య తే
జో మధురమ్ము నీయునికి
    సూచితి మత్ప్రణయార్ద్రవీక్షణ
గ్రామ మనంతమార్గముల
    కై ప్రసరింపగ నాఁటనుండియున్.

ఏ జన్మమ్మున వ్రాయఁగాబడియెనో
    యీ పుణ్యముల్ మన్ముఖాం
భోజాతమ్మునయందు మూపులుపడెం
    బో యంతభారమ్ము లీ
పూజాద్రవ్యములైన నా హృదయమున్
    పొంగించెప్రేమాపగా
భ్రాజత్తుంగతరంగరంగముల పై
    పైనున్న తేలించుచున్,

ఇవి తలపైధరించి సివ
    మెత్తిన నేననురాగవాహినీ
ప్రవిమలసర్వతీర్థముల
    పాతరలాడితి నల్పభావనల్

తపులఁగరాని యక్షయప
   థమ్మున నీ వొకమిన్కు చుక్కవై
దివమునుబోలె భూతలము
   దిద్దుచునుంట యెఱుంగ కక్కటా.

ఇక్కడ నేటి కిట్లు మెఱ
   యించితి నీ ప్రణయమ్ము నీవు నా
చుక్కవు పూజకై వలయు
   సొమ్ము లివేకొను పారవశ్యపుం
జొక్కున నాదుమానసము
   సోలినయప్డనురాగబంధముల్
స్రుక్కఁగఁ గన్మొరంగెదవు
   సూ! జలదప్రతిసీర లొడ్డుచున్

ఈ ప్రణయయాత్ర ముగియలే దింక ముగియ
దనుము నా చుక్కవైన నీ వస్మదీయ
మానసాభ్రమ్ము నవ్యయమధురరాగ
మూలమునయందు లీనమైపోవుదనుక.

(అనాతవరం)

# పడవ పగిలిన!

ఇది పగిలిపోవు నను భయ మ్మింతవలకు
ఈ తలంపున ఆనంద మిపుడు పొంగు
పగిలిపోయినచెక్కల పట్టువిడువ
కీవు పాథోనిధానమ్ము నీదెద వని!

•

ఇది పగిలిపోవు నను భయమ్మింతవలకు
ఈ తలంపున నిపు డుల్ల మిగురులెత్తు
తునిగిపోయినచెక్కలతో పయోధి
గర్భమున రత్నరథ మీపు కట్టెద వని!

ఇది పగిలిపోవు నను భయ మ్మింతవలకు
ఈ తలంపున నిపు డాత్మ కింత శాంతి
విఱిగిపోయిన చెక్కల దరికి జేర్చి
నీ చితికి కాష్ఠములుగ మన్నించెద వని!

(ఒంగోలు)

# తూర్పిడి

ఓ ప్రణయరాశి ప్రతికూల ముగ్రపవన
వీచికాఘట్టనమున కంపితుఁడ నయ్యు
కారణ మ్మేమొ నిను తూరుపాఱఁబట్టు
కాంక్ష యొక్కఁడె నా యాత్మఁ గలఁచివైచు.

•

ఇన్నిక్రంతలజల్లెడ ! యిది యెవండు
చేసినదొ ! తావకామృతస్నిగ్ధమధుర
హృదయమున నికరమ్ము నూహించు నాస
నేను దీనిని చేతఁబూనితిని కొంత

హస్తములు పడిపోవు నెల్లపుడు నాకు
ప్రాప్తమైన యీ జల్లెడ పట్టలేక
ఐన రేగెడు నీ పొల్లునందు ధూళి
ధూసరితగాత్రుఁడను కృతార్థుఁడను సుంత

అనిల ముగ్రమ్ముగా వీచుననుము దాని
యుద్ధతికి నాగలేక యీయొక్కజల్లె
డయును గళితమ్మ యనుము హస్తమ్మునుండి
నా ప్రయత్న మదేరీతి నడచుచుండు.

అది మహాతీవ్రముగ నీచు ననుము కొంత
గాకపోయిన నికకొంత గాలి యించు
కంత యనుకూలమైన నా కదియు చాలు
నీ నికరమైనహృది కొంచెమైన చూతు.

# దృక్పరిణామము

1

అది హఠాత్సంభవము శంప లగుచు నీదు
కనుతుదలు మున్ను చిత్రమ్ముగా మెఱయుట
నవనవోన్మేషరాగమ్ము నాదు దృష్టి
యంతయును గుంజుకొంటివ యంతలోన

•

అతిశయితచంచలము నీ దృగంతమందు
త్రోవకై త్రొక్కులాడు నంధుఁడన యయ్యు
నిలువఁబడితిని ప్రణయసంచలితముగ్ధ
భావనైశ్చల్య మది యూఁతపట్టు గాగ

2

ఉన్నయటు లుండి నాదృష్టి నూడ్చుకొనిన
ఱెప్పలు బిగించుకొంటివి రేకు మొగుడు
నా కనుల్ సుళ్ళుతిరుగంగ భీకరమ్ము
చిమ్మచీకటిలో గుండె చెదరిపోయి

అవశ్యమైన మదీయదేహమ్ము భీతి
కుంచుకొనిపోవ తంత్రులు కొన్ని తెగిన
హృదయవల్లకీ గళదసృగ్రేఖలందు
నార్ద్రరాగమ్ములూరె నిరంతరమ్ము

3

ఇప్పు డున్మేషములు భవద్దృక్కులందు
నవనవోదయవర్షలక్ష్మి వలె నమృత
సంభరితమయ్యె నిట్లు విషాదమధుర
నిశ్చలమ్మైన దేలొ ! నీ నిండుజూపు

•

అంతనిలుకడల్ నీ వీక్షణాంచలములు
ప్రణయవాహిని యట పేరుకొనియె నేమొ
మన పరస్పరభావిజీవనచరితము
చదివి యట దుఃఖమో సంతసమ్మొ పడుదు

(ఒంగోలు)

# ఈశప్సిత లేశము

అది నడుచువేళ  నేలఁ జీరాడు కుచ్చె
రేపు దుమ్మున నొక త్రసరేణువు నయి
దాని తనువునఁబుట్టు స్వేదమునఁ గలసి
కరగిపోదును రూప మేర్పడుపరాఁక

•

అది యుషస్స్నాన మొనరించి యంతఁ గట్టు
కొనిన పచ్చని పట్టుదుకూల మందు
నార్ద్రమగు లేజరీయంచునై తదీయ
దేహమున గగుర్పాటులు దిద్దుకొందు

అది శుచిర్భూతయై దేవతాళి పూజ
లైన వెనువెంట తన  పూతహస్తమంటి
హారతికి వెలిగించు క ర్పూరమునయి
వాసనలు చిమ్ముదును దాని వదనమందు.

అది సుధారస మొలుక మాటాడునపుడు
దాని నాభిమూలమున నుద్గతమనోజ్ఞ
ఫణితులం దొక్క ప్రణయ భాషణమ నగుచు
త్రోవలో దాని రసన కంటుకొనిపోదు.

అది త్రికాలమ్ము సేవించు నాకుమడుపు
నై తదీయాచ్ఛదంతసంహతుల నలిగి
యైన రాగమ్మునన్ దాని యధరమునకు
నిత్య నైవేద్య పాత్రికల్ నింపుకొందు

అది చిదుమరానిసిగ్గుచే నదుమఁబడియు
నధికమౌ ప్రేమపారవశ్యమునఁ దీయు
కూనరాగమ్ములోని సంకుచిత సూక్ష్మ
భావనిర్దిష్ట మవ్యక్తపదము నగుదు

అది ప్రతినిమేషమును పీల్చునట్టి గాలి
నై తదీయోష్ఠరక్తనాళాంతరముల
మందముగ గాఢముగ నిల్చి మండు విరహ
వేదనానలమున నులివెచ్చనగుదు

దాని హృదయపీఠిక నధిష్ఠాత నగుదు

ప్రణయినీవదనాంచల భాగమందు
నొక్క చిరునవ్వుతరంగనై యూగుచుందు
ప్రణయినీశీతలదృగంతపాతమందు
కరడుగట్టిన యొక సుధాకణమ నగుదు.

ప్రణయినీ ప్రసూనాంగసంస్పర్శ తగిలి
తగులనివిధాన కలిగినంతనె యనంత
దివ్యరాగస్రవంతిలో తేలిపోదు

(ఒంగోలు)

# రేపు

ఈ మహానిదాఘము దుర్నిరీక్ష్య చండ
సూర్యకరకల్పితము పాపకార్య మటవె
ఒడలు దహియించుకొను నీ వియోగవహ్ని
కుండమున నాజ్యధారలు క్రుమ్మరించె.

నల్లమలలందు మిక్కిలి చల్లన యట
మారుతము దారిలో నెట్టుమాటె భీష
ణాతపాశ్లేష విషమ రూపాంతరమ్ము
చెంది పడమటిగాలి నన్ చెరగివైచె

నాదుభావాభ్రపథము సంతతము వెదకు
పుష్యమీ ప్రణయినివి నీవును నిదాఘ
తీక్ష్ణ రోహిణీ వేషమ్ము దిద్ది మండి
పడితి వేలొ నా హృదయమ్ము పగిలిపోవ

అసహజమైన నీ నడత
యందలి నిర్దయలోన క్రాగి మా
నసంపుంబగుళ్ళలో ప్రళయ
నాట్యపునాంది పఠించుకొన్న నా
యసువు లతివ్యధాకులము
లర్ధ నిమీలిత లోచనాంతబా
ష్పసముదయమ్ములో నిదుర
పాలయి చిక్కిన వేమిచిత్రమో.

కలంతనిద్దురలో నీవు కన్ను గొనల
నొకటి రెండు బాష్పాంబువు లుబుక ముగ్ధ
మృగశిరారూపమునం దోంచి స్మృతిపథమున
'నాథ రేపుగదోయి!' యన్నయటులయ్యె

ఆ నిమసమ్ములో హృదయ
మందున నాసలు రేంగ చూచితిన్
నా నయనాంచలమ్ముల
ఘనీభవమయ్యె దయారసాంబుధుల్
ప్రాణమువచ్చి నిన్ను భుజ
బంధమునన్ గరగింప లేచితిం
బో నను మోసపుచ్చి యిటు
పోదువె కాలములోన లీనమై

(ఒంగోలు)

# కృష్ణ యొడ్డున

ఈ తరంగమాలాకుల కృష్ణవేణి
సై కతనిషణ్ణుడఁను నీ ప్రశాంతమధుర
మోహనవిముగ్ధరూపమ్ము ముంచుకొన్న
నా మది యనంతభావసంకలిత మిపుడు.

•

బురదలై యానకట్టలు పొరలిపాఱు
నీ యెఱుపునీరు మామకస్మృతిపథమున
నంకితమ్ము విపర్యాసితానురాగ
దళితహృదయుని రక్తాశ్రుధారవోలె.

ఎట్టులో ఈదుదున యన్మ కృష్ణవేణి
క్రమ్ముకొను గాఢసంతమసమ్ము నందు
కడు భయంకరములు తూర్పుకనుమ లవియు
దాటలే నెట్లు నీ దివ్యదర్శనమ్ము

కనుల కందని వాహినీ గర్భమట్టు
లతి దురూహ్యాభీకరము నీ యంతరమ్ము
కొదమనెలవంకరీతి నా కొండనెక్కి
నీవు మెఱయుదువే రమణీయమూర్తి!

నీ విలాసమ్ము ప్రతిఫలించిన జలమ్ము
త్రావి యున్మత్తుఁడను ప్రేమభావమందు
ఈ నవతరంగడోలిక లెక్కి యూఁగు
చా యనంత సాగరసంధి నరయఁబోదు.

(క్లార్క్ హాస్టల్)

# ఆ గవాక్షము

ఆ గవాక్ష మెంత దయారసార్ద్ర హృదయి
అను నిమేషమ్ము విద్యుల్లతాభమైన
ప్రణయినీ ముగ్ధరూపలావణ్యరేఖ
లవము నాదృష్టిపథమునఁ దవులనిచ్చె.

ఆ గవాక్షమ్ము చేసిన దనుము పుణ్య
మమృతవల్లరియైన ప్రేయసి కరాబ్జ
గళిత మధుర మరంద శీకరము లందు
కరగిపోవుటఁజేసి నా కన్ను గొనల

ఆ గవాక్షమ్ము తానెంత యమృతరాశి
ఎవ్వరును లేని సమయాన నేగి దాని
స్పర్శసుఖమున పులకలు జాదుకొనఁగ
ప్రణయమున ముగ్ధుఁడను పరవశుఁడనైతి

(క్లార్క్ హాస్టల్)

# ముగ్ధప్రణయము

చిత్తమున నిన్ను భావించి చెవులు సోకు
ప్రేమఘంటారవోదితావేశవశత
పోదు నీ మందిరద్వార భూమి దనుక
అలసభావమ్మున న్నంత నలముకొనును

నీ పవిత్రోత్తమాంగపూజాపరత్వ
మున విరిసికొన్న నాదు లోచనసుమమ్ము
లభినవోన్మేష లజ్జాభరానతములు
ముకుళితమ్ములు నీపాదపూజకగును

అంతవఱకు సుధాప్రసన్నాతిమధుర
మోహనశ్రీకమైన నీ మోముదమ్మి
ముగ్ధలజ్జాదృగంతమై ముడుచుకొను;ను
భక్తునకు దగినట్టి దైవతమ వీవు

తనువు ముచ్చెమటలు పోసి తప్పిదారి
ఎట్టులో గర్భగుడి ప్రవేశింపఁగలను
ప్రణయ భావాతి ముగ్ధ దేవతకు నీకు
విమల కర్పూర నీరాజనమును పూని

అదియు వణకెడు నాచేతులందు కలఁగి
పొడము నిట్టూర్పులో నారిపోవ నిమ్ము
చీకటులు బాపు నీరూపు రేకలందు
నొక్క నిముసమ్ము వెలిఁగి ధన్యుఁడను నేను.

•

(బందరు జట్కాబండిలో)

# నిత్యక్రీడ

ఉదయ సంధ్యా నవాంశువు లదుమ దద్ద
రిల్లి ఆశాంతములనుండి మెల్ల మెల్ల
కుంచుకొని పోవు నీనీడ కొనల వెంట
చేరుకొందును నీ పదాంభోరుహములు

•

ప్రబల మధ్యాహ్న తీక్ష్ణాతపమున కలఁగి
అలసిపోయిన నీ నీడఁ గలసిపోయి
ప్రణయ భావాతిమధుర విశ్రాంతి కొఱకు
నీ శరీరాంచలములంటి నిలిచి యందు

అపరసంధ్యార్ద్రరోచుల నమృతరాగ
మంజు రంజితమైసాగి మఱల దెసలు
క్రమ్ముకొనిపోవు నీనీడఁ గలసి వెడలి
ఆ యనంత దిగంతమ్ము లావరింతు

# తిరస్కారము

నీ మనోహరమృదుకంఠసీమఁ జేర్ప
నీ ప్రసూనమాలిక సంతరించి తెచ్చి
ప్రేమభీరుత్వమున త్రపావిహ్వాలుఁడను
జారవిడిచితి నీ పాదసవిధభూమి

ఆ ప్రణయపారవశ్యమ్మునందు నాదు
హృదయమున నాసలూరె నీవెత్తి దాని
గళమునం దాల్తువని నీదు కఠిన పాద
తాడనమ్మున నది చెన్ను తఱుగు టెఱుఁగ

నా ప్రణయమూల్య మిటు శీర్ణమై ప్రసూన
దళము లెప్పుడు ధూళిలోఁ గలసిపోయె
అపుడు నాహృదయమ్ము సహస్రథావి
భిన్నమై నెత్తురులు తాండవించె నందు

శేషమాల్యమ్ము ధూళిదూషితము హృదయ
గళిత శోణితధారలో కడుగుకొనుచు
నేమి సేతు నిరాశానికృత్తదృష్టి
లేమ నీనుండి మరలింప లేకపోతి

మాల్య శేషమ్ము నెడఁదలో మ డుచుకొనుచు
నా హృదయ వీణె తంత్రులు నలఁగి తెగిన
యెడ వదలిపోవనెంచులో నిట్టె చూతు
నీ కనులయందు కన్నీరు నిండి తొలఁకు

(క్లార్క్ హాస్టల్)

# విశ్వరూపము

ప్రథమ సందర్శనముననే ప్రణయమూర్తి
నాదు కనుపాపలందు సంధానమయ్యె
నది సురుఁగకుండ నారెప్ప లదుముకొంటి
క్రమముగా నది నా యంతరమున నిండె

అంత భరియంపలేక నా యక్షి యుగ్మ
మల్ల తెఱచితినో లేదొ యంతరమున
ప్రతిమ బ్రహ్మాండగోళమ్ము పట్టలేదు
నేను నిలువను తావు సుంతైన లేక

ఆ ప్రణయరాశి విశ్వరూప ప్రకాశ
మునకు నంధుఁడనై నేను మూలమూల
లొదుగుకొనిపోవుచుంటి నన్నుద్ధరింప
తలఁపుగొన దది తనలోన కలుపుకొనదు

(క్లార్కు హాస్టల్)

# ప్రణయలేఖ

నా మనోహరికి రసోన్మాదినైన
నేను వ్రాసినలేఖ నా ప్రాణముద్ర
లుంచి మడిచియు తుదకు పంపించనేర
క ప్రయత్నుండనైతి నిద్రాంకమందు.

•

అమృతనిష్యందమధురమ్ము లక్షరములు
స్వప్నమున నాహృదయరక్తసంకలిత భ
యంకరాసహ్యరూపమ్ములగుచు పేర్చి
అంతకంతకు నా కన్నులందు పొడిచె

చెంతఁ గూర్చున్న ప్రేయసి సితవిలోల
లోచనాంతమ్ము లందు వెల్లువలు పాఱు
బాష్ప సంప్లావితాక్షరపంక్తు లస్ర
వాహినులు ముంచె నా యల్ప దేహయష్టి

పెల్లయిన భీతితో దద్దరిల్లి లేచి
కనులు తెఱువకయే లేఖకై తడవితి
పడక నలువంక లొకవింతభావమందు
తగిలి నాహస్తముల కది తగులలేదు

ప్రళయసమయఝుంఝానిలభయదమైన
గాలిలో కొట్టుకొనిపోదు గద అదృష్ట
శూన్యమున నా ప్రణయలేఖ సుళ్ళుపడుచు
నుల్లమిది జివ్వుమనిపోవు నుండి యుండి

(క్లార్క్ హాస్టల్)

# ఏమిటిది

ఇది యననుభూతపూర్వమౌ నీ ప్రణయము
ప్రకృతి హృదయాంతరమ్మున ప్రతిఫలించు
నీదు రూపమ్మనుసరించు నాదు మేను
గాలికంటెను చులకనై తేలిపోవు.

•

ఇది యననుభూతపూర్వమౌ నీ ప్రణయము
యగాధ మనోవాహినీ ప్రవాహ పాతమున
కొట్టుకొనిపోవు నాతలంపు
లధిగతాశాంచలమ్ములై యల్లుకొనును

ఇది యననుభూతపూర్వమౌ నీ ప్రణయము
అవ్యయ ప్రేమరాశి నీ యాత్మలోన
నడఁగిపోవుచు నా పేదయంతరాత్మ
దివ్య శోభానివాసమై తేజరిల్లు

(క్లార్క్ హాస్టల్)

# ఏనాటికాంక్ష

మొదట నే హ్రస్వమూర్తినై పొదలు వేళ
కనులఁ దోచితి గాలిలో కదలియూగు
చెట్టు చిరుకొమ్మతో దిగి చెంత మెఱసి
పోవు నొక చిన్ని మిణుగురుపుర్వు రీతి

అందుకో చేయి చాచితి నపుడు నిన్ను
కాని నా హస్తమూరకే కంపితమయి
వాల్చుకొనిపోయినది దుఃఖవశమయైన
యుల్లమున మాత్రమాశలు పల్లవించె

పెరిగితిని నిర్మల ప్రేమసరసిలోన
నీదులాడుచు నిప్పుడు నెదుగుచుంటి
నెంత పెరిగిన నేమి నా కంత యంద
కీవు దూరమ్ము పోయెద వెగిరి యెగిరి

అంత యెత్తైదిగియును నిన్నరయనైన
లేన ఒకనాఁడు మబ్బులలోన నుండి
చూచితిని రెండు లక్షల చుక్కలు పడ
నామనస్సున నాశలు ననలు విచ్చె.

నాకు ఱెక్కలు వచ్చుచున్నవి నభోంత
భూములవి దాటిరా బుద్ధి పొంగి పొరలు
అచట నక్షత్రమండలి యవలనైన
నాకు నందుదువన్న దే నాఁటి కాంక్ష.

(అనాతవరం)

# ప్రణయాగ్ని

ఎడతెరపిలేక మండెడు నీ విశుద్ధ
వహ్ని నీచేత రగిలింపఁబడిన మొదలు
నవ నవానందకందమై నామనమ్ము
తచ్ఛిఖా మాలికలలోన తాండవించు.

•

మాఱుచుండును నాకేమి నీ రచించు
గాలియం దీశరీర రేఖలు వినీల
జలధరాచ్ఛాదితమ్ములై స్వాంతమందు
మారుతోద్ధూత మిది పేర్చి మంట మండు

ఈ శరీరమ్ము తప్తమై ఈ యనంత
శిఖిశిఖామాలికలలోన జీర్ణ మనుము
భౌతికమ్మైన యీ ప్రతిబంధకమ్ము
లేక యీ వహ్ని నిన్ కబళించి తీరు

(క్లార్క్ హాస్టల్)

# ప్రళయము

భాద్రపదమట విమలాభ్రపథము గ్రమ్మ
నీ వినీలాంబుదోద్ధతమ్మీ యఖండ
వర్షధారాప్రవాహమ్ము వచ్చి వచ్చి
నాహృదయగోళమునయందు నదులు గట్టు

•

జీర్ణవసనుండ నీ చలి చించుకొనెడు
నాకృశీభూత దేహమ్ము పైకి పొర్లు
నీ ప్రవాహవేగము నిల్వనీదు నన్ను
ప్రళయసూచనయేమొ నా ప్రణయమునకు

అంత కంతకు దుర్వారమై ధరిత్రి
యింతయును ముంచుకొనునటే యీ యకాండ
విలయజలరాశి నా నిరుపేద జీవ
కళిక తనలోన నొక యశ్రుకణము జేసి

ఆ మహాక్రూర జలరాశియం దనంత
భంగము లుదగ్రగతుల నుప్పొంగు నను ము
అచట నా ప్రేమ యను మఱ్ఱియాకు పఱచి
నేను పవళించెదను సుధానిభృతమూర్తి

(క్లార్క్ హాస్టల్)

# ప్రణయమూర్తి

మనసు కాపురమున్న నా కనుగొలఁకుల
సూదిమొనలు తేరిన వెఱ్ఱిచూపులందు
వెడలు కన్నీటిబిందులు విన్ను ప్రాకి
లెక్క పెట్టఁగ రానన్ని చుక్కలగును

•

అవి కవోష్ణబాష్పములో ప్రేమామృతకణ
సముదయమొ నాదు హృదయరక్తమొ మఱేమొ
ఆ యనంతాంబునిధులు న య్యమృతకరుఁడు
ఆ చరమసంధ్యలందు నా కాటవిడుపు

అతినిరాశలో మ్రింగిన హాలహలము
హృదయమునందు సుధాజీవనదులు గట్ట
నే నమృతశీతలుండనై నిలిచినపుడు
దేవతలకైన నేను పెట్టినది భిక్ష

హృదయము ద్రవించి ద్రవించి యేమి యగునొ
నాకు తెలియదు నవతరంగాకుల మ్మ
నూన కరుణారసాంబుధినైన నేను
పొంగి బ్రహ్మాండభాండముల్ ముంచుకొందు

ప్రకృతి నా యాత్మలోపల ప్రతిఫలించి
ప్రణయినీ రూపమున నన్ను పట్టుకొనును
కరగి నీరౌను పులకలు గ్రమ్ముకొన్న
యొడలు సానంద పారవశ్యుఁడను నేను

(ఒంగోలు)

# నా గూఁడు

జీవకళ లుట్టిపడు నొక్క చిత్రమరసి
కరగి యమృతమ్మ యైన నా కన్నె హృదయ
మే యనూహ్యమార్గములనో యేళ్ళు పాఱి
నీదు సౌందర్యసీమ ఘనీభవించు

•

మధురమార్దవకంఠమ్ము మక్కళించి
మిత్రుఁ డొకపాట పాడును మేను వణకి
పోయి యమృతస్రవంతుల పుట్టినిల్లు
నీ గళవిలీన గీతిలో దాఁగుకొందు

హృదయమృదువీణె తంత్రులు కదలిపోవ
ప్రేమగీతమ్ము చదువును ప్రియసఖుండు
మనసు పెగులని భావమర్మములఁగలచు
నీ ప్రణయమూర్తిలోన కన్నీరు నాకు.

(బందరు)

# కత్తిపడవ

కాగితమ్మున పసినాఁడు కట్టి కత్తి
పడవ పాఱుఁడు నీటిలో విడిచినావు
పాలబుగ్గలపై నవ్వు తేలిపోవ
చిన్ని క్రేగంటి చూపుల నన్నుఁ జూచి

ఏను పసిబాలకుఁడను ని న్నేమరించి
తోడి చెలికాండ్రు నవ్వులు తూరుపెత్త
తడిసి ముడుతలు వడిన యాపడవ నెటులొ
తెచ్చి నా పూవుటెద ప్రతిష్ఠించుకొంటి

అంత కొన్నాళ్ళ కీవు నే నచట నిచట
గాలితరఁగల నీ నవ్వు తేలిరాదు
నీ సుధాపాంగ రేఖలు నిలిచిపోవ
క్రుంగిపోయిన నా పేదగుండె నిపుడు

కాగితమ్మది యినుమునకన్న నినుము
ఆ చిఱుతకత్తి పదనున కంతులేదు
అచట ప్రేమస్రవంతి యవ్యాహతముగ
కదులుచుండుటఁజేసి నా బ్రదుకు నిలుచు

కడకు నెత్తురుచెమ్మైన గ్రమ్మకుండ
పచ్చి గాయమ్ము లవి యమబాధ పడవ
కదిపితిని పొమ్ము లక్షలు కత్తు లచట
దిగఁబడున యన్న భీతిలో దిగులు నాకు.

(ఒంగోలు)

# ఆసుర కృత్యము

ఎవ్వఁడే నీ గళమ్మునం దిరవుకొనగ
నేను విసరిన ప్రేమ ప్రసూనమాల
నడుమ నీవు చూడఁగఁబట్టి నలిపివైచి
నీ కనులయందు నెత్తురుల్ నింపినాఁడు

•

భావిభాగ్యోదయ ప్రభాభాసమాన
సుందరమ్మైన స్వాప్న కానందమందు
మైమరిచియుండ నెవ్వఁడే మచ్చరించి
నా యెడఁదలోన చురకత్తి నాటినాఁడు

ఈ నిరంతర తీవ్రబాధానికృత్త
మైన నా ముగ్ధహృదయమ్ము నంతరాళ
శూన్యతలి నెవ్వఁడే నిలుచుండఁ బెట్టి
ఎడతెగని సంశయముల బంధించినాఁడు

ఈ యగమ్యవాయుపథమ్ము లేగనేర్చి
మన నడుమ దూతలైన యీ వినయశీల
పరమ పరమాణువులకు వాగ్బంధనమ్ము
నెవ్వఁడే కఠోరముగ శాసించినాఁడు

ఎవ్వఁడే రాక్షసుఁడు మనమీద నున్న
యవధి యంతయుఁ దానయై యాక్రమించి
వికటదంష్ట్రాభయంకర వికృతవదన
విషమహాసుండు నన్నిట్లు వెక్కిరించు.

(ఆలూరు)

# కార్తిక పూర్ణిమ

1

శారద దినాంతరమణీయసాంధ్యరాగ
విమలపథముల నీ నాఁడు వెల్లివిరిసి
నీప్రణయరాగ మెల్లెడ నిండుకొనియె.

ఆ యెగిరివచ్చు పూర్వదిశాభిముఖము
లైన పులుఁగులు ఱెక్కలల్లార్పులందు
మధురకంఠధ్వనులయందు మాటలందు
నీ బయలుదేరు సంగతియే భరించె

ప్రావృడంభోధరముల వర్షములు మోచి
శీతలమనోహరాంగ సుస్నిగ్ధమూర్తి
ఉత్తరానిలుగర్భ ముఱ్ఱూత లూచె
నీ ప్రయాణభేరీ కమనీయరవము

ఈ మనోజ్ఞ కార్తిక పూర్ణిమా మహోద
యావసరమున పొంగి బ్రహ్మాండమంత
యైన నా యాత్మలో భవదమృతమూర్తి
నిరుపమ విలాసలేశముల్ పొరలిపోయి

నీ వెడలుదారి కాచుకో నిశ్చయించు
కొంటి
కానుకగా కన్నుఁగొలకులందు
దాఁచుకొంటి నిరంతర దహనశీల
చిరవిరహవహ్ని ప్రాణముల్ మఱుఁగుచోట
సేకరించిన యుష్ణాశ్రుశీకరములు

2

నాప్రయత్నమ్ముచూచి ప్రేమ ప్రశాంత
మైన నా నవ్వు మొగము మౌగ్ధ్యమ్ము చూచి
నా చెలుల్ చుట్టపక్కముల్ నవ్వినారు

ఎడఁద లజ్జావిషాదమ్ము లిగురుతొడిగి
మొగము కుంచించి దుప్పటి ముసుగుపెట్టి
చేయునదిలేక మేను సేర్చితిని సెజ్జ

ఆ కళాపూర్ణ రాకాసుధాకరుండు
నా ముసుగులోన తలసూపి నవ్వినాఁడు

నావిషాదమ్ము పొంగులై నా నిరాశ
పొరలి నా మేను గద్గదస్ఫూర్తిజెంది
కలికి కన్నీటికానుకల్ కారిపోయి
అలసి అరగూర్కినాను కావలయు నేను

3

నిదురలోనైన నూరట కుదురుకొనని
స్మృతిపటమ్మున నొక వింత మెఱుపు మెఱసి

నిరుపమ ప్రేమగీతమ్ము నీరథమ్ము
గమన రావమ్ము కర్ణరంధ్రములు నిండి

ఆ నిముసమందె కదియు నీ స్యందనార్ధ్ర
చక్రధారల నేర్పడ్డ చాళ్ళవెంట
నా హృదయభూమి నమృతమ్ము బాహిరిల్లి

త్రిభువన మనోజ్ఞ భవదీయ దివ్యరూప
లలిత లావణ్య రేఖావిలాసదీప్తి
త్రోసికొనివచ్చి నా ఱెప్ప లోసరిల్లి
నేను లేచితి

నంతలోఁ గానరాక
నీ రథము సాగిపోయె నిర్నిద్రఫణితి

కాలజీమూతముల్ హిమకరుని మ్రింగి
కాఱుచీకట్ల దశదిశల్ కళవళించి
నాకనుల్ కుంఠితములయ్యె నన్ను నేన
చూచుకొనరాక హోరని వీచి నిశిత

మైన యీదురుగాలి బ్రహ్మాండమందు
ప్రళయ శైతల్య తాండవ ప్రభలు రేఁగె

ఆ యుదయ సూర్యు డనుదిన మట్లు గాక
చండకిరణోగ్రమూర్తియై మండినాఁడు

(ఆలూరు)

# శుక్రవారము

ప్రేమ మధుపూర్ణమైన నా హృదయ పాత్ర
ఈ దినము నీ పెదవుల కందింతు ననెడు
నాసలో కన్ను విచ్చితి నమృతసరసి
ప్రాతరున్మిషితమ్మైన పద్మమట్లు

ఆ త్రిలోకైక జనని పాదాబ్జసవిధ
భూమి మీలిత నేత్రవై మోకరిల్లి
నీవు పూజాసుమమ్మవైనావు హృదయ

కర్ణికామూలమున భక్తి కందళించి
అడరు పారవశ్యమ్మునఁ దొడిమ యూడి
నేను పూవునై పడితిని నీదు చెంత

జంటపూవుల అమృతనిశ్వాస సౌర
భమున రోదసి శుక్రవారము నదించె

ఈ వినూతన భావముల్ తావిలేని
పువ్వులని అంధలోకమ్ము నవ్వనిమ్ము
నీ దృగంత ప్రణయరేఖ పాదులైన
మధువు లూరించుఁబో నాదు హృదయమందు

1

అంత శ్రమపడి పావన మభ్రగంగ
ధారుణికిఁ దెచ్చినాఁడు భగీరథుండు
అంత మథియించి కలశ రత్నాకరమ్ము
అమృతభాండమ్ము పడసినా రమరవరులు.

మత్పురానేక పుణ్య జన్మములు పండి
జాహ్నవీస్వచ్ఛపును సుధా స్వాదు మూర్తి
వైన నీ దివ్యసాన్నిధ్య మందుకొంటి
పుడమికిన్ స్వర్గమున కొక్కముడి రచించి

ఇంతకాలమ్ముగా నా కదృష్టము లయి
ఎన్ని ఆనంద ధామమ్ము లీ యనంత
భువన సంధుల భాసిల్లు నవియు నేఁడు
మత్పదాక్రాంతములు భవన్మహిమజేసి.

(బందరు)

2

ఈ నవీన వసంతమ్ము లెన్ని యెన్ని
ఒరసికొనుచున్న వ(భ్రంకషోజ్జ్వలముగ
మన విలాసాం(ఘ్రి పద్మ లాంఛనపథమ్ము
పుడమి పరవశతన్ గగుర్పొడిచి పొడిచి

ఈ విలాసవసంతపు టెల్లలందు
మన కటాక్షాంచలమ్ములు పెనచుకొన్న
మధుర రంగమ్ములటవె మన్మథకుమార
జన్మవాసరోత్సవ సముజ్జ్వల పథమలు

(గూడూరు)

3

నీ ప్రసన్న మౌగ్ధ్యములు జీర్ణించుకొన్న
లేఁతనవ్వుదొంతర పిసాళించెఁబోలు
కాక యిది యేమిటేయీ వికచవసంత
నవ్యమృదుమల్లికాప్రసూనముల పొలుపు

నా యెద పరీమళసనాథమై యనంత
భావవీథుల యందు శంపాప్రకాశ
రమ్యమౌ నీ యదృష్టానురాగ రేఖ
రీతులను పోల్చుకొనుచు పరిభ్రమించు.

(గూడూరు)

4

నీ తొడ తలాడగా శయనింపఁగలిగి
దేవి నా జన్మమున్ సమర్థించినాను
ముక్తి సీమంతినీ త్రపాముగ్ధ వరద
హస్తవలయితఁడౌ పరమాత్ముఁబోలి

(నూజివీడు)

5

మునుపు పద్యమ్ము వ్రాయుట యనిన గుండె
చీల్చుకొని నెత్తురుల్ బయల్ జిమ్మె ననుట
ఇపుడు పద్యమ్ము ప్రేమ పొంగించుకొన్న
నా నవానందవాహినిలోని నలుసు

మునుపు పద్యమ్ము వ్రాయని దినము లేదు
ఇప్పుడానందపరమార్థమేలుచున్న
నాదు హృదయాంతరాళమ్మునన్ ధ్వనించు
అసలు పద్యమ్ము వచ్చిన దని సతమ్ము.

(ఒంగోలు)

6

ఇమ్మనుజలోకగగనాంచలమ్ము లైన
తగులని త్వదీయదివ్యపాదములు దేవి
నా ప్రణయశృంఖలాసాధనములచేత
తిగిచి యీ నేలపై సమర్థించినాను

మద్భుజాబంధమున మేను మఱచియును ని
రంతరము నూర్ధ్వమార్గమ్ము లనుసరించు
నీ గిలుకుటందె రవళిలో భాగమైన
మత్ఫలశ్రుతి దివిజధామములు ముట్టు

(ఒంగోలు)

7

నా హృదయమూలమున సమున్మత్త పరిమ
ళాభిరామమ్ములౌ ప్రణయాంకభావ
కుసుమమాలలు నీ ముందు కుప్పవోసి
చూచుకొమ్మని నీ వంక చూఁచినాను.

అమృతవాహినులందు విశ్వములు తేల
నీవు కన్నులలో నవ్వినావు దేవి

గళిత గర్వాండనైన నా కంఠసీమ
రంజితమ్మైన రత్నహారమ్మిదేమి
ఈ యమూల్యభాగ్యము భరియింపలేక
తడవ తడవకు పెట్టెలో దాఁచుకొందు

(లయోలా)

8

నీ యనంత రూపములకు నిలునీడ
యైన నా నిరుపేద దేవాలయమ్ము
నెట్లు తగినట్లు కై సేయు టెట్టు లని ని
రంతరము నాకు తీఱని చింత దేవి

నిముస నిముసమ్ము నిట సమున్మిషిత తావ
కాంఘ్రినీరేజదివ్య రేఖాంక మిదియు
శబలితవిచిత్రరోచిరుజ్వల మలోక
మధుర సౌందర్యసోపానమండితమ్ము

నాదుభాగ్యమ్ము నాలోన నా కె వెఱఁగు

(లయోలా)

9

ఈయగమ్యపర్వతపంక్తు లెక్కి వచ్చి
నీ గృహప్రాంగణమ్మున నిల్చినాను
నా యెడఁద సంశయావిష్టమై యెఱుంగఁ
బడని యర్థమ్ములైన నీ భావగతుల

పరమపదనాథు కౌఁగిటకు పార్వతియుఁబోలె
నాకౌఁగిటకు యోగముద్ర నున్నావు నీవు.

10

నీ వధిష్టించు భద్రపీఠీ విరాజ
మాన మాణిక్య కాంతుల లోన భ్రమసి
నీ రుచిర రాజ్యపుం బొలిమేరలందు
తెన్ను గానక గ్రుడ్డినై తిరుగు నన్ను

నన్ను నీ చెంతఁ జేర్చుకొన్నావు దేవి

నీ వధిష్టించు భద్రపీఠీవిరాజ
మాన మాణిక్య కాంతులు మలసి మలసి
విశ్వవీథుల ప్రణయముల్ వెల్లివిరియు

ఈ యమృత రాజ్యమున మన మిద్దరమును
నీవు రాజ్ఞివి నేను నీ సేవకుఁడను

(లయోలా)

11

అంతు లేని యీ యాత్ర నిరంతరాయ
సాంతమయ్యెను నా జన్మ సఫల మయ్యె
ననుచు మూపున పూజోపహార సమితి
దించుకొన్నాను నీపాద దీప్తధరణి

పరవశత్వమునన్ మేను మఱచియున్న
నాకు నీ యమృతాలింగనమ్ము లోని
ప్రథమ సంస్పర్శ నెల్ల విశ్వములు తోఁచె
నెన్నఁడును లేని యొక దివ్యదృష్టి కలిగి

కలసిపోయిన యాత్మలు పులకరించు
నూతనపథమ్ములందు సంగీతమురలి
స్వాంత వీణాశ్రుతులఁ గల్పి పాడుకొందు
ఈ ఫలశ్రుతు లింక నె న్నెన్ని కలవొ

(లయోలా)

12

నీవు నిండుకుండవు ప్రేమ భావమందు
అమరులకు నైన కొలువ శక్యమ్ముగాని
ప్రణయ సూత్రమ్ము నీలోన బయలు వెడలి
నా గళాంకితమ్మైనది నాఁడు నాఁడు

నీవు నిండుకుండవు ప్రేమభావమందు
మాటి మాటికి నావేశమగ్నమైన
హృదయమున నీదు పాట లూహించుకొనుచు
దిగ్దిగంతాంతరమ్ములు తిరిగి తిరిగి
చివర నా కట్టుకంబము చేరుచుందు

(లయోలా)

13

తలిరు మెత్తని చిన్ని పాదములు మోపి
నా శిరస్సున ముద్రించినావు దేవి
అమృతవల్లులు చిక్కు జీరైన నీదు
కను మలుపులందు ననురాగ వనధులూఁగి

కృష్ణపాద చిహ్నిత ఫణాగ్రేసరుండు
కాళియుని రీతి నీ యంఘ్రికమలదీప్తి
లోన భాగ్యము మెఱయుచున్నాను నేను

ఈ బహిర్జీవనమ్ము భరింపజాల
నన్ను నీలోన నైక్యమ్మొనర్చుకొమ్ము.

(లయోలా)

14

దైవపథాంతరమ్ముల నీ విహార
మిటులు నా వంకకే ప్రసారించినావు

అల్ప మర్త్యుఁడ నేను సహస్రకోటి
దివిజగంగలు నాతల నవతరించి
నట్టులయ్యెను నాదు భాగ్యమ్ము దేవి

ఇచట నాతోడి నీయాట లెలమి మిగుల
భూతల స్వర్గ నందనమ్ములు రచించు
కొనుట నాపని

(లయోలా)

15

వినుచునుందును విన్నది వినని యట్లు
కనుచు నుందును కన్నది కనని యట్లు
స్వప్న గాథలవలె ప్రపంచములరీతి
చిత్రములు దేవి నా బహిశ్చేష్టితములు

సంతతమ్మైను విమల తేజఃప్రశాంత
మోహనమ్మైన నీ ప్రేమ మూర్తిలోన
అవ్యయానంద మధుర రేఖాంచలములు
దిద్దుకొనుచుందు.

(లయోలా)

16

వత్సలాఫాలమున నెలవంక గుఱుతు
కందళించి వికాసించి కళలు దేరి
తరుణశారద రాకాసుధాకరాచ్ఛ
బింబము లనంతములు లెక్క పెట్టకొనెడు

ఈ యమర్త్యాచ్ఛ చంద్రిక లెన్ని నాళ్ళు
నా తనువు ముంచు కొను నన్నినాళ్లు ఒక్క
యీ శరత్తేమి నాది సదాశివత్వ పదవి

(లయోలా)

17

ఒకరొకరు చూచుకొనుచు పండుకొనినాము
మా పరస్పరాలోకనమార్గణములు
మా హృదయమూలజీవమర్మములు కలఁచి

ఎగసికొను సుళ్ళలో వలయీకృతమ్ము
లంత కంతకు విరళీకృతమ్ము లలలు
అమృతరసగర్భితములు మ మ్మావరించె

మా శరీరాంచలములు కంపములు పుట్టి
మా పెదవులందు చిరునవ్వు మాధురిల్లి
మా కొదవు పారవశ్యసంభ్రమమునందు
ఒక రొకరి నేత్రయుగళి మూసికొనినాము

(ఒంగోలు)

18

నా వనము నీవు నా యాట నీవు నా వి
లాసకేళికామోహనలక్ష్మి నీవు
నా యెలుఁగు నీవు నా చిఱునగవు నీవు

నా సరస్వతి నీవు నా చదువు నీవు
నా విపంచిక నీవు నా నవ్యమధుర
గీతి నీవు నాహృదయమ్ము రీతి నీవు

నానిదుర నీవు నా కలలోన నీవు
ఏ నిదురలోని వచియింపరాని దైన
ప్రవిమలానంద భావానుభవము నీవు

నా ప్రయాణమ్ము నీవు నా పథము నీవు
నా విడిది నీవు నా చేరు నగరు నీవు
నా పరము నీవు నా పరాత్పము నీవు

(రైలులో)

19

ఈ విలాస రాకా చంద్రుఁడేమి లెక్క
వత్సలా దివ్యఫాలలావణ్య రేఖ
చివర వెలుఁగులు బో వీని జీవనమ్ము.

ఓయి మన్మథ యీ వసంతోదయావ
సరము చేయూఁతగా నీ ప్రశంసయేల
ఆగు మాగుము నా యంతరాంతరమున
నా ప్రణయరాశి శివమూర్తి నాట్యమాడు

(నెల్లూరు)

20

ఈ పినాకిని పుట్టిన దెచ్చటనో యె
ఱుంగఁజాలను మును నీ యపాంగవీక్ష
ణాధిరోహావరోహమ్ములందు నిపుడు
తేటపడియెను దీని పుట్టిన తెరంగు

ఇదియు నీలోన పుట్టి నాహృదయవీథి
వాహినులు కట్టి నురుగుఁలై బయలుప్రాఁకి
భువనములు చుట్టి సత్పథమ్ములను ముట్టి
మిన్ను మన్నేకమూఁగ మిఱుమిట్లు గొలుపు

(నెల్లూరు)

21

తలిరు మెత్తని నీదు పాదములు గప్పి
నాపదమ్ములు, చిన్ని నీ నవమృణాళ
సదృశకరములు మూసి హస్తములు నావి,
అమృతపుష్పసుగంధి నీ యాస్యసుమము
మధ్గళమ్మున నిశ్వాసమధువు లూదు
కొనఁగ నీ మూర్ధమును మూరుకొనుచు నేను,

ఇట్లు బాహ్య ప్రపంచ విస్మృతిని దేవి
ఒదుగుకొని శయనించు నిన్ పొదువుకొని వి
లాస సుందర దివ్యలీలఁ బదునాల్గు
భువనములు బొజ్జలోన నిముడ్చుకొన్న
బాలకృష్ణుని రీతి నే పవ్వళింతు

(నెల్లూరు)

22

చిత్రముగ నిద్ర వచ్చి మూసికొని పోవు
నా కనులలోన కను లుంచినావు దేవి
అంతరమ్మున నప్పు డనంతకోటి
లోచనము లేక కాలమ్ములోన విచ్చె

ఊర్పుసలుపని నా ముక్కు లూది యూది
నీదు విశ్వాసపవనమ్ము నించినావు
అంతరమ్మున నప్పుడనంతకోటి
జీవవాయుతరంగముల్ చెంగలించె.

(ఒంగోలు)

23

ఈ యుదయభిక్ష పెట్టిన దెవరు నాకు
నా వనమ్మెల్ల ప్రేమసౌందర్యకుసుమ
వాసనలతో నమర్త్యసౌభాగ్యసీమ

ఓయతిథులార రండు విచ్చేయుఁడిచట
నా ప్రణయ దేవతాచరణముల జాడ
లరసికొనుచు వనమ్మెల్ల తిరిగి తిరిగి
సేకరించిన యీ జీవలోకమధువు
లించు కాని కొంచము విశ్రమింత్రుగాని.

(నెల్లూరు)

## 24

మనకు మనలోన సిగ్గను మాట లేదు

తేటలగు నవ్యయ ప్రేమతీర్థములు ప
రస్పరాత్మలలో నిద్దఱమును నొక్క
రొకరి ప్రతిబింబములను చూచుకొను ముక్త
యోగులము లోననుండి పైకుబికి యుబికి
వచ్చు జన్మజన్మాంతరవాసనాత్మ
కములు చిరునవ్వుదొంతరల్ గాక మనకు

మనకు మనసులోన సిగ్గను మాట లేదు

(నెల్లూరు)

## 25

మనము మేనత్తమేనమామల బలమ్ము
ఒకరి నొక రెడబాయ కాడుకొను నాళ్ళ
మన శరీరమ్ముల కభేదమును గ్రహించి
మనల పేరాడుకొన్నారు మనుజు లెల్ల

మనము ప్రణయమహాకావ్యమున నపూర్వ
నాయికానాయకుల మభిన్నమ్ములైన
మన మనోభావగీతమ్ములను పఠించి
పరవశము పో రసజ్ఞ ప్రపంచ మెల్ల

మనము మనశరీరమ్ము లమాట మఱచి
మనసులను దాటి యూహ కందని విధాన
ఐక్యమైపోయి యేగుచున్నప్పు డచట
మనమెఱుంగని యెవ్వరో మనల నెఱుఁగు

(నెల్లూరు)

26

ఇదియు నిష్కాలమేఘశారదవిభావ
రీ ప్రభావమ్ము నిర్మల ప్రేమ మనది
అశ్వయుజశుక్లపక్షామృతాంశురేఖ
ఈ ప్రణయమందె పూర్ణీభవించు టెల్ల

మంచు విరియించు మన కటాక్షాంచలమున
ఇవముకొని శైత్యమెక్కి కుంచించుకొనియె
ఆదిరసమూర్తి శివుని దేహార్ధ మట్లు
తెలితళుకు లొత్తు నీ శరద్దీర్ఘరాత్రి

(నెల్లూరు)

27

ఈ తలిరుపాదములయచ్చు లెచటివే ర
సాతలుల్ పుల్కరించు నాజాడలందు

ఈ యమృతహస్తమాతృక లెచటివే ప్ర
సాదమాధుర్య మొలయు నాస్పర్శలందు

ఈ మనోజ్ఞసాచి ప్రసారేక్షణమ్ము
లెచటివే శారదజ్యోత్స్న లివతళించు

ఓ ప్రణయలోకవాసిని సుప్రసన్న
దేవతామూర్తి నిన్ను నర్థించు చుంటి
ఈ మహాప్రేమమంత్రనేతృత్వమధుర
సార్ద్రవచనమ్ము లెచటివే అనుపదమ్ము
ఆశ్రుతులయందు నా యంతరాత్మ కరగు

ఓ ప్రణయలోకవాసిని

28

నీ ప్రణయలీల లతివిచిత్రములు దేవి

ఎందుకో నాకు తెలియరా కెట్టి నెండ
కాయుదువు నీకటాక్షవీక్షణములందు
చెమ్మ యంతయు నిగిరిపో సొమ్మసిలిన
పొలము పోలిక నెట్టెలువోదు నేను

కండనిప్పుల పడమటి కొండగాలి
చిఱుత నిట్టూర్పులో విదల్చెదవు పైన
నేల సదమదమై రేఁగు ధూళిలోని
ఒక యణువు రీతి సుడిగొను చుందు నేను

కురియుదువు వాన నీలాంబుధరము లౌరయు
నీదు బొమముడులందు నే నిముసమందో
చినుకు చినుకున నాని మెత్తన భజించు
పుడమి మాదిరిగా గగుర్పొడుతు నేను

మంచు విరియించెదవు సుధామధురహాస
చంద్రికా స్వచ్ఛ శీతలచ్ఛాయ లందు
పాలవెన్నుల వరిపైరు పగిది నేను
ముగ్ధపరవశ భావముల్ మురుమ్మరింతు

(నెల్లూరు)

29

నా వియోగము చిత్రమైనది సఖుండ

నాదు దేశాంతరప్రయాణమ్ము లందు
తొలకరించు నవాషాఢ జలదమాల
ప్రణయినీ లోచనాంతలావణ్యరేఖ
పాదుకొని లో వియోగమ్ము లేదు నాకు

మరలి స్వగృహాగతుఁడను మన్మందిరాగ్ర
భాగమున నాదురాకకై బయలు చూచు
గేహలక్ష్మి కృశీభూత దేహవల్లి
గాలిసోఁకి నాలో వియోగమ్ము రేఁగు

ఏక శయ్యాంతరులము మాయిద్దఱమును
కలసికొన్న నిశార్ధ భాగమ్మునందు
పొలయలుక వచ్చి మా మధ్య కలఁత పుట్టి
నా వియోగాగ్ని కప్పుడంతమ్ము లేదు

## 30

బావ యను మాట ప్రేమప్రపంచమునకు
నీవు పెట్టిన పేరు, నాభావమందు
పద్యములు తోఁచి అక్షరప్రాభవమున
బయలువెడలుటలో శ్రమపడుదు నేను

ఒక మొలకనవ్వు నన్ను నీవు కరగింప
నేరిచినది, రసజ్ఞతాస్ఫోరకములు
చుంబనము లంచు ఆలింగనంబు లంచు
ప్రతిపదమ్మును అలజడి పడుదు నేను

(నెల్లూరు)

1

శ్రీదములైన నీ నయన
రేఖల దివ్య సుధాస్రవంతికల్
పాదులు గట్టి నా హృదయ
పద్మము నీ కరుణాప్రసాద సూ
ర్యోదయ దీప్తిలో నవన
వోన్మిషితమ్మయి భక్తి గీతికా
స్వాదుమరందముల్ బయలు
ప్రాకెను నేటి కనుగ్రహింపవే

ఈ చవు లెట్టివో తెలియ
నింతకు పూర్వము నవ్యభావముల్
పూచిన తేనెలన్ తడిసి
పోయిన నా హృదయాంతరమ్మునన్
నీ చిరునవ్వు వెన్నెలలు
నిండిన యీ సకల ప్రపంచ మం
బా ! చిగిరించు నేని చరి
తార్థుడనే గద నాడు నాటికిన్

2

చీకటి కాటుకల్ విరియ
జిమ్మెడు నాదిగనంత భూములన్
ప్రాకి తమోవృతాంధములు
మామకదృక్కులు మూతలై భయ
వ్యాకులముల్ మదీయ హృద
యాంతర భాస్వదఖండ దీపికా
శ్రీకర కాంతిలో మరల
రెప్పలు విచ్చి సమాశ్వసిల్లెడున్

ఏ తొలినాడు నీవు వెలి
గించిన దీ ప్రతిభాంక మాంతర
జ్యోతి నవాంతరాయ నివ
హోగ్ర మహాప్రతికూల మారుతో
ద్ధూతమయి చలించు ప్రణ
తుండను తావక వత్సలత్వ సు
శ్రీ తరలించి నా హృదయ
రేఖలలో ప్రవహింప జేయవే

3

ఏచిన దాహ తాపమున
నెండకు వానకు దోసి లొగ్గి దుః
ఖాచిత మానసుండ నయి
అప్పటి కప్పటికిన్ త్వదీయ పూ
జా చరణమ్ము నా యెడద
కందక ఖిన్నుడనై కృశించి యీ
వీచెడు శీతలానిలము
వేగము నెట్లిపు డోర్తు నంబికా!

ఈ చలిగాలి పోసుకొని
హృద్గహనమ్ము ప్రతిధ్వనించు బా
ధా చకితమ్ము యై ప్రళయ
దారుణ శైత్యభరమ్ము నౌదలన్
మోచిన నాదు మేన్ వణకి
పోయెడు వెచ్చదనాల వెల్లి! నీ
పై చెరగింత కప్పుకొన
బట్టుము నాకు కృపాప్రసన్నవై

4

ఈ వనరాశి మధ్యమున
నీ గతి న న్నెదు రీద బంచి దుః
ఖావలమైన నా బ్రదు
కనంత ముఖమ్ముల క్రుంగిపోవ నీ
వావలి తీరసైకత వి
హారపథమ్ముల నార్త రక్షణ
శ్రీ వెలయన్ చరించు చిటు
చిర్నగవుల్ పచరింతు వంబికా!

ఆ దరహాస చంద్రికల
కర్థము సుంత యెరుంగ రాక శం
కా దళితమ్ము నా హృదయ
కంజము దుస్తర మీ పయోధి యం
దీదగ జాల కంగకము
లెత్తువడున్ జగదేకరాజ్ఞి! నీ
యాదరణంపు నౌక నిటు
లంపుము నన్ను సముద్ధరింపగన్

5

అది మొదలంట సర్వమ్మును
నప్పుడు శూన్యమ యంట యెందుకో
పెదవి గదల్చి నీవు నొక
వింతగ నవ్వితి వంట తల్లి ! నీ
మృదుహసితమ్ములో పరిమ
ళించిన దంట సమస్త విశ్వముల్
సదమల తావకీన కరు
ణారస పాన వివర్ధమానమై

ఆ చిరునవ్వులో జనన
మందిన యీ పసిమొగ్గ గాలిలో
బూచియ పోలె నూదితివి
పొమ్మని యెన్ని యుగమ్ములో కదే
నీ చరణాంబుజ ద్వితయ
నిష్ఠితమై వికసించు భాగ్యముల్
నోచుకొనంగ లే కిటులు
లోలత దిగ్వలయమ్ము జుట్టెడున్

6

ఈ గతి నీ కృపాధుని ప్రస
 వించెదునే జననీ ! అసహ్య చి
తా గరళమ్మొ తిండి యగు
 నా కొక కొండ యనుగ్రహించినా
వే గతినైన తత్సకల
 మెక్కుదు బొమ్ము దురంత దుర్దశా
యోగములోన నా హృదయ
 మూగెడు దుర్భర సాంధ్యవేళలన్

దాని పయిన్ కరాగ్ర ముప
 ధానముగా తల వాల్చి విస్తృతం
బైన యనంత విశ్వము దృ
 గంచల బాష్పముల న్నటింపగా
నీ నరలోక వీథి నిర
 సింతును బో క్షణ మంతలోన పె
ల్లై నను ముంచివైచు దెస
 లల్లెడు గాఢ తమిస్ర పుంజముల్

7

ఇది యెరియించు నాకళియు
నియ్యది తీరని దాహమున్ గతిం
చె దినము లిన్ని నీ యమృత
శీతలముల్ చనుబాలు పొంగి నా
హృదయము పాలవెల్లి యని యీ
నవ శారద చంద్ర చంద్రికా
భ్యుదయ దిగంతరాళమున
మున్కలు వైచుచు మోస పోయెడిన్

వెరవిడి నైన నా హృదయ
వేదనకుం గరుణించి వచ్చి నా
కెరుగగ రాక పాలొసగి
యేగుదువున్ ప్రతి నిత్య మట్లు కా
కిరు లలమున్ తమస్వినుల
హృద్యమయై గగనమ్ము పొల్చి యు
త్తరమును దక్షిణమ్ము కవ
దార్చెడు చుక్కలమార్గ మేమిటో

----- 0 -----



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | REHB02L236 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 24.1.24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 163 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CL, 2A, 16B, 122A, 88A, 143 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandhu |
| పేజీలు విడదీసినది | Nandhu |
| స్కాన్ చేసినది | Lakshmi |
| పరీక్ష చేసినది | Sandhya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |